గీతార్థసంగ్రహాకలిత


# శ్రీమద్భగవద్గీత



ప్రతిపదటీకాసహితము.

ఇది

తం. తేవప్పెరుమాళ్లయ్యగారిచే
తెలిఁగింపఁబడిన

శ్రీ రామానుజభాష్యముతోడను
తాత్పర్యచంద్రికాదులందుఁగల
విశేషవిషయములతోడను



వేమూరు - వేంకటకృష్ణమసెట్టి అండ్ సన్సు చేఁ
బ్రకటితమైనది.

MADRAS
1916.

Price Rs. 2-8-0.]



AGES 1 TO 480 AND TITLE PAGE PRINTED AT THE ANANDA PRESS, MADRAS.

శ్రీమద్భగవద్గీత - విషయసూచిక.



A

## శ్రీకృష్ణాయ నమః.

---

జయతు జయతు దేవో దేవకీనన్దనోఽయమ్
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః।
జయతు జయతు మేఘశ్యామలః కోమలాఙ్గో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః॥
ఫుల్లేన్దీవరకాన్తి మిన్దువదనం బర్హావతంసప్రియమ్
శ్రీవత్సాఙ్క ముదారకౌస్తుభధరం పీతామ్బరం సున్దరమ్।
గోపీనాం నయనోత్పలార్చితతనుం గోగోపసఙ్ఘావృతమ్
గోవిన్దం కలవేణువాదనరతం దివ్యాఙ్గభూషం భజే॥
కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యా మ్యహమ్
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తుభ్యం నమః।
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహమ్
కృష్ణే తిష్ఠతి సర్వ మేత దఖిలం హేకృష్ణ రక్షస్వ మామ్॥
తత్త్వం ప్రసీద భగవన్ కురు మ య్యనాథే
విష్ణో కృపాం పరమకారుణికః కిల త్వమ్।
సంసారసాగరనిమగ్న మనన్త దీన
ముద్ధర్తు మర్హసి హరే పురుషోత్తమోఽసి॥
నమో నమో వాఙ్మనసాతిభూమయే
నమో నమో వాఙ్మనసైకభూమయే
నమో నమోఽనన్తమహావిభూతయే
నమో నమోఽనన్తదయైకసిన్ధవే॥

---

శ్రీమద్గీతా కాలక్షేపారంభమునందు తమతమసంప్రదాయమునకుఁ దగినట్లు గురుపరంపరానుసంధాన పూర్వకముగా ననుసంధింపవలసిన శ్లోకములు.

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్॥
అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరో హరిః।
అఫాలలోచన శ్శమ్భు ర్భగవాన్ బాదరాయణః॥
సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేనచ
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే॥
సారథ్య మర్జున స్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః॥
ప్రపన్నపారిజాతాయ వేత్రతోత్త్రైకపాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః॥
కరకమలనిదర్శితాత్మముద్రః
పరికలితోన్నతబర్హిబర్హచూడః।
ఇతరకరగృహీతవేత్రతోత్త్రో
మమ హృది సన్నిధి మాతనోతు శౌరిః॥
అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయరసజుషా చక్షుషా వీక్షమాణః।
సవ్యే తోత్త్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివసన్ పాతు న స్సూతవేషః॥
కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్॥
కృష్ణాయ యాదవేన్ద్రాయ జ్ఞానముద్రాయ యోగినే
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాన్తవేదినే॥

## శ్రీభగవద్గీతామాహాత్మ్యము.

గీతాశాస్త్ర మిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్
విష్ణోః పద మవాప్నోతి భయశోకాదివర్జితః॥
గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్యచ
నైవ సన్తిహి పాపాని పూర్వజన్మకృతానిచ॥
మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే।
సకృ ద్గీతామ్భసి స్నానం సంసారమలనాశనమ్॥
గీతా సుగీతా కర్తవ్యా కి మన్యైః శ్శాస్త్రసఙ్గ్రహైః।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా॥
భారతామృతసర్వస్వం విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతమ్।
గీతాగఙ్గోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే॥
సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః।
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥
ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత, మేకో దేవో దేవకీపుత్ర ఏవ।
ఏకోమన్త్ర స్తస్యనామానియాని, కర్మాప్యేకంతస్యదేవస్యసేవా॥
ఓమ్॥ అస్య శ్రీభగవద్గీతామహామన్త్రస్య

భగవాన్ వేదవ్యాసః — ఋషిః
అనుష్టుప్ — ఛన్దః
శ్రీకృష్ణః పరమాత్మా — దేవతా
అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే } ఇతిబీజం
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ — ఇతి శక్తిః
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః } ఇతికీలకమ్

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః } ఇత్యంగుష్ఠాభ్యాంనమః

నచైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుతః } ఇతి తర్జనీభ్యాంనమః

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్యఏవచ } ఇతిమధ్యమాభ్యాంనమః

నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయంసనాతనః } ఇత్యనామికాభ్యాంనమః

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః } ఇతికనిష్ఠికాభ్యాంనమః

నానావిధానిదివ్యానినానావర్ణాకృతీనిచ } ఇతి కరతలకరపృష్ఠాభ్యాంనమః

ఇతి కరన్యాసః.

---

అథ హృదయాదిన్యాసః.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః } ఇతి హృదయాయ నమః

నచైనంక్లేదయన్త్యాపోనశోషయతిమారుతఃఇతిశిరసేస్వాహా

అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్యఏవచ } ఇతి శిఖాయైవషట్

నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః } ఇతి కవచాయ హుమ్

పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః } ఇతినేత్రత్రయాయ వౌషట్

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ ఇత్యస్త్రాయఫట్
శ్రీకృష్ణప్రీత్యర్థే పాఠే వినియోగః.

శ్రీకృష్ణాష్టోత్తరశతమ్.

శ్రీకృష్ణః కమలానాథో వాసుదేవ స్సనాతనః ।
వసుదేవాత్మజః పుణ్యో లీలామానుషవిగ్రహః ॥ ౧
శ్రీవత్సకౌస్తుభధరో యశోదావత్సలో హరిః ।
చతుర్భుజాత్తచక్రాసిగదాశఙ్ఖాద్యుదాయుధః ॥ ౨
దేవకీనన్దన శ్శ్రీశో నన్దగోపప్రియాత్మజః ।
యమునావేగసంహారీ బలభద్రప్రియానుజః ॥ ౩
పూతనాజీవితహర శ్శకటాసురభఞ్జనః ।
నన్దవ్రజజనానన్దీ సచ్చిదానన్దవిగ్రహః॥ ౪
నవనీతవిలిప్తాఙ్గో నవనీతనటోఽనఘః ।
నవనీతనవాహారో ముచికున్దప్రసాదకః ॥ ౫
షోడశస్త్రీసహస్రేశ స్త్రిభఙ్గీ మధురాకృతిః ।
శుకవాగమృతాబ్ధీన్దు ర్గోవిన్దో యోగినాంపతిః ॥ ౬
వత్సవాటచరోఽనన్తో ధేనుకాసురభఞ్జనః ।
తృణీకృతతృణావర్తో యమళార్జునభఞ్జనః ॥ ౭
ఉత్తాలతాలభేత్తాచ తమాలశ్యామలాకృతిః ।
గోపగోపీశ్వరో యోగీ కోటిసూర్యసమప్రభః ॥ ౮
ఇళాపతిః పరంజ్యోతి ర్యాదవేన్ద్రో యదూద్వహః ।
వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః ॥ ౯
గోవర్ధనాచలోద్ధర్తా గోపాల స్సర్వపాలకః ।
అజో నిరఞ్జనః కామజనకః కఞ్జలోచనః ॥ ౧౦
మధుహా మధురానాథో ద్వారకానాయకో బలీ ।

బృన్దావనాన్తసఞ్చారీ తులసీదామభూషణః ॥ ౧౧
స్యమన్తకమణే ర్హర్తా నరనారాయణాకృతిః ॥ ౧౨
ముష్టికాసురచాణూరమల్లయుద్ధవిశారదః ।
సంసారవైరీ కంసారి ర్మురారి ర్నరకాన్తకః ॥ ౧౩
అనాదిబ్రహ్మచారీచ కృష్ణావ్యసనకర్శకః ।
శిశుపాలశిరశ్ఛేత్తా దుర్యోధనకులాన్తకః ॥ ౧౪
విదురాక్రూరవరదో విశ్వరూపప్రదర్శకః ।
సత్యవా క్సత్యసఙ్కల్ప స్సత్యభామారతో జయీ॥ ౧౫
సుభద్రాపూర్వజో విష్ణు ర్భీష్మముక్తిప్రదాయకః ।
జగద్గురు ర్జగన్నాథో వేణునాదవిశారదః ॥ ౧౬
వృషభాసురవిధ్వంసీ బాణాసురకరాన్తకః ।
యుధిష్ఠిరప్రతిష్ఠాతా బర్హిబర్హావతంసకః ॥ ౧౭
పార్థసారథి రవ్యక్తో గీతామృతమహోదధిః ।
కాళీయఫణిమాణిక్యరఞ్జితశ్రీపదామ్బుజః ॥ ౧౮
దామోదరో యజ్ఞభోక్తా దానవేన్ద్రవినాశకః ।
నారాయణః పరంబ్రహ్మ పన్నగాశనవాహనః ॥ ౧౯
జలక్రీడాసమాసక్తగోపీవస్త్రాపహారకః ।
పుణ్యశ్లోక స్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః ॥ ౨౦
సర్వతీర్థాత్మక స్సర్వగ్రహరూపీ పరాత్పరః ।
ఏవం శ్రీకృష్ణదేవస్య నామ్నా మష్టోత్తరం శతమ్॥ ౨౧
కృష్ణనామామృతంనామ పరమానన్దకారకమ్ ।
అత్యుపద్రవదోషఘ్నం పరమాయుష్యవర్ధనమ్॥ ౨౨

ఇతి శ్రీకృష్ణాష్టోత్తరశతం సమ్పూర్ణమ్.

---

# శ్రీకృష్ణాష్టకమ్.

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥
అతసీపుష్పసఙ్కాశం హారనూపురశోభితమ్ ।
రత్నకఙ్కణకేయూరం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥
కుటిలాలకసంయుక్తం పూర్ణచన్ద్రనిభాననమ్ ।
విలసత్కుణ్డలధరం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥
మన్దారగన్ధసంయుక్తం చారుహాసంచతుర్భుజమ్ ।
బర్హిపిఞ్ఛావచూడాఙ్గం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥
ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్ ।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వన్దే జగద్గురుమ్।
రుక్మిణీకేళిసంయుక్తం పీతామ్బరసుశోభితమ్ ।
అవాప్తతులసీగన్ధం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
గోపికానాం కుచద్వన్ద్వకుఙ్కుమాఙ్కితవక్షసమ్ ।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
శ్రీవత్సాఙ్కం మహోరస్కం వనమాలావిరాజితమ్ ।
శఙ్ఖచక్రధరందేవం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి ॥



శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః.

మొదటికూర్పు.

---

ఈగ్రంథమునకు టీకాతాత్పర్యములనుమాత్రము మదీయ
సుమిత్రులైన రాజశ్రీ వేమూరు-తిరువేంగడత్తా౛ శ్రేష్ఠి
రు రచించి వానిని నా కొకానొకప్పుడు చూపినవారైరి. నే
టీకా తాత్పర్యముల యొప్పిదమును దేటఁదనమును జూచి
వి యవశ్యముగా ముద్రింపఁదగునని చెప్పఁగా, వారందుల
ద్యకొని తన్ముద్రణపరిశోధనమునందు నన్ను నియమించిరి.
టీకాతాత్పర్యములు శ్రీరామానుజభాష్యము ననుసరించి
యనంతకొలఁదిని వ్రాయంబడినవయ్యు, ఆభాష్యమును
పూర్ణముగా వివరింపనిచో నందలి సిద్ధాంతములలో ముఖ్య
లైనవియేనియుఁ జక్కఁగాఁ దెలియుట కష్టముగా నుండుట
తను, భాష్యహృదయమో శ్రీవేదాంతదేశిక కృతతాత్పర్య
ంద్రికాసాహాయ్యము లేనిచో దురూహముగానుండుటచేతను,
ాష్యాభిప్రాయమంతయుఁ గరతలామలకమగుటకై యందలి
షయముల నెల్లను, దనుపపాదకములైన తాత్పర్యచంద్రికయం
లి ముఖ్యాంశముల నన్నిటిని, గూడినంతసులభశైలితో య
ామతి తెనిఁగించి యచ్చోయెడల నక్షత్రచిహ్నకుండలీకర
ాదులు గూర్చి చేర్చినాఁడ.

ఈ. తేవప్పెరుమాళ్లయ్య.

బవరినెల 1908 సం॥

## రెండవకూర్పు.

### పీ ఠి క.

లోకమునందుఁ బ్రాణులకెల్ల సామాన్యమైయున్న సంసార దుఃఖమును దొలఁగించి వాస్తవమయిన నిత్యసుఖమును గలిగించుటకై బుద్ధిమంతు లనేకులు తత్త్వవిచారముచేసిపెక్కు విషయములను పద్ధతులను సిద్ధాంతీకరించిరి. అట్లు వారువారు చేసిన సిద్ధాంతములు వారివారి దర్శనములనియు మతములనియుఁ జెప్పఁబడును. ఇట్లు సాంఖ్యము, యోగము, నైయాయికము, వైశేషికము, మీమాంస, వేదాంతము, అని దర్శనము లాఱు ముఖ్యముగా నేర్పడెను.

సాంఖ్యమును యోగమును ఈశ్వరుఁడున్నాఁడని యంగీకరింపవుగాన అవి నిరీశ్వరమతము లనఁబడును. అందు జడసముదాయమెల్ల ప్రకృతియనియు చేతనసమష్టియెల్ల పురుషుఁ డనియు తత్త్వములు రెండు. పురుషుఁడు ప్రకృతిబంధమునఁ జిక్కి జననమరణాత్మకమైన సంసారమును బొందుచున్నాఁడనియు, ఆ బంధమునుండి విముక్తిఁ బొందుటయె నిత్యసుఖ(అనఁగా మోక్ష)మనియు సాంఖ్యమతము. ప్రకృతినుండి విముక్తిఁ బొందుటకై యమ నియమ ప్రాణాయామాదులగు అనుష్ఠానములను దెలుపునదియే యోగదర్శనము.

నైయాయిక వైశేషికములు తర్కప్రధానములగుటచే తార్కికమతము లనఁబడును. ఇందును బ్రకృతియును బురుషుఁడును గలరు. ఈశ్వరుఁడును గలఁడుగాని, ఒకకార్యమున కొక కర్తయుండక తీఱదనెడి అనుమానముచేత-అనఁగా జగత నెడి

కార్యమునకు జగత్కర్త యొకఁడుండు నను న్యాయముచేత - సిద్ధించినవాఁడుగాన అనుమానసిద్ధుఁడగునుగాని ఆగమసిద్ధుఁడు గాఁడు. ఇందు ధర్మాధర్మరూపమై సుఖదుఃఖములిచ్చునది అదృష్టమని యొకటిగలదు. దానిచేత దుఃఖమత్యంతము నివర్తించుకొనుటయే యిందు మోక్షము.

మీమాంసయు వేదాంతమును వేదములనే ముఖ్యప్రమాణముగా ఆశ్రయించినవిగాన వైదికమతము లనఁబడును. మొదటఁజెప్పిన సాంఖ్యము మొదలయిన నాలుగింటికిని వేదములు ప్రమాణముగావు. వేదమందలి కర్మకాండమును మీమాంస ఆశ్రయించియుండును; జ్ఞానకాండమును వేదాంతము ఆశ్రయించియుండును. మీమాంస ప్రకృతిపురుషులతోఁగూడ 'అపూర్వ' మను మూఁడవదానిని బ్రతిపాదించుచున్నది. ఇదియె సుఖదుఃఖము లొసఁగునది. ఇందీశ్వరుఁడు చెప్పఁబడఁడు. వేదమందలి యజ్ఞాది విహితకర్మములను జేయఁగా ఆత్మకు స్వరూపప్రాప్తి కలుగుచున్నది. ఇదియె మీమాంసయందు మోక్షము. వేదాంతమందు ప్రకృతియుఁ బురుషుఁడును ఈశ్వరుఁడునుగలరు. ఇందలి యీశ్వరుఁడు ఆగమసిద్ధుఁడేకాని అనుమానసిద్ధుఁడుగాఁడు. రెండుమతములందును సిద్ధాంతమునకై తర్కము గ్రహింపఁబడుచున్నది. అయిన నది వేదానుగృహీతమైననేకాని వేదవిరుద్ధమైనచో నెంతమాత్ర మంగీకరింపఁబడదు. వేదమె యీరెంటికి సర్వోత్కృష్టమైన ప్రమాణము.

ఆఱవదియైన యీవేదాంతమునందు పెక్కులు అంతర్భేదములుపుట్టి పెక్కుమతములైనవి. ఆమతములన్నింటను ప్రకృతి, పురుషుఁడు, ఈశ్వరుఁడను మూఁడునుగలవు. కానియీమూఁ

టిస్వరూపములనుగూర్చియు వీనికిఁ బరస్పరముగల సంబంధము లనుగూర్చియు అభిప్రాయములు భిన్నములగుటంబట్టి యీమత భేదములు గలిగినవి. అవి అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము అనఁబడుచున్నవి. అద్వైతమున ప్రకృతియు పురుషుఁడును మిథ్యలనియు, ఈశ్వరునిభ్రాంతిచేఁ గలిగినవనియు, ఈశ్వరుఁడే సత్యమనియు, అతఁడొక్కఁడే తత్త్వమనియు సిద్ధాంతము. ఇందులకుఁగర్త శంకరాచార్యులు. పురుషుఁడుమాత్రమే మిథ్యయనియు, ప్రకృతియు ఈశ్వరుఁడును సత్యములనియును, అందు ప్రకృతి యీశ్వరునియం దుపాధినొందిన యొకభాగమేకాని వేఱుకాదు గాన మొత్తమునకు ఈశ్వరుఁడొక్కఁడే తత్త్వమనియు, భాస్కరాచార్యులు సిద్ధాంతముచేసిరి. ప్రకృతియును పురుషుఁడును ఈశ్వరుఁడును మూఁడును సత్యములనియు, అయినను ప్రకృతిపురుషు లీశ్వరుని వికారములేకాని వేఱుకానందున తత్త్వ మొక్కటియేయనియు, యాదవప్రకాశులు చెప్పిరి. శంకరు లభేదజ్ఞానముచేతను, భాస్కరయాదవులు జ్ఞానకర్మసముచ్చయముచేతను, ఈశ్వరస్వరూపముతో ఐక్యమునొందుట మోక్షమనిరి. ఈమూఁడు మతములు వరుసగా మాయావాదము, ఉపాధివాదము, వికారవాదము అనఁబడును. ఈమూఁడు మతములును గొంత భేదముగలిగియున్నను మొత్తమునకు తత్త్వ మొక్కటియే యున్నదని చెప్పుటవలన అద్వైతమనఁబడును.

ప్రకృతియు పురుషుఁడును ఈశ్వరుఁడునను మూఁడును సత్యములనియు, అనాదిగా వేఱువేఱై యుండునవేకాని, యొకటి మఱియొకదాని యుపాధిచేతఁగాని వికారముచేతఁగాని కలుగ

లేదనియు విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు సిద్ధాంతీకరించిరి. ఇందు ప్రకృతిపురుషు లీశ్వరునకు శరీరమనియు, ఈశ్వరుఁడు వానికెల్ల ఆత్మయనియు, మూఁటికి శరీరాత్మసంబంధము చెప్పఁబడియున్నది. భక్తిప్రపత్తులచేత ఈశ్వరస్వరూపానుభవమునొందుట యిందు మోక్షమగును. ప్రకృత్యాదులుమూఁడును రామానుజ మతముచొప్పున సత్యములును అనాదిగా సిద్ధములు నగునుగాని పరమకల్యాణస్వరూపుఁడైన యీశ్వరునికి హేయములైన ప్రకృతిపురుషులతో శరీరాత్మసంబంధమెంతమాత్రము గలుగదని ద్వైతమును మధ్వాచార్యులు ప్రతిపాదించిరి. ఇందు భగవత్ప్రసాదముచే స్వస్వరూప యోగ్యమైన యానందము పుట్టుటయె మోక్షము.

ఈమతత్రయమువారు బ్రహ్మసూత్రములకును దశోపనిషత్తులకును భగవద్గీతకును భాష్యములు వ్రాసి తమతమదర్శనములను సిద్ధాంతీకరించిరి. కనుక బ్రహ్మసూత్రాదులు మూఁడును ప్రస్థానత్రయ మనఁబడును. అందు భగవద్గీతకు రామానుజాచార్యు లనుగ్రహించిన భాష్యమునననుసరించి పూర్వమొకటీక వ్రాయంబడినది. ఇపుఁడు రామానుజభాష్యమునే సంపూర్ణముగాఁ దెనిఁగించి యందుల సందిగ్ధాంశములకు వివరణముగా శ్రీవేదాంతదేశికులు రచించిన తాత్పర్యచంద్రికయను వ్యాఖ్యలోని విశేషవిషయములనుగూడ సవిస్తరముగాఁ జేర్చి మఱియు నావశ్యకములగు పెక్కువిషయములనుగూర్చి యిది యిపుడు ప్రకటింపనయ్యెను.

మఱియు శ్రీయామునార్యులు గీతాసారముగారచించిన గీతార్థసంగ్రహమునకు వేదాంత దేశిక విరచితమగు వ్యాఖ్య నను

సరించి సరళముగాఁ దాత్పర్యమును, గీతాసారసర్వస్వ మని ప్రాయికముగా నెన్నంబడు చరమశ్లోకమునకు శ్రీలోకగురు కృతరహస్యార్థము ననుసరించి యొక లఘువ్యాఖ్యయు నిందుఁ మునుపటివలెనే కూర్పంబడియున్నవి, ఆయామతస్వరూపముల ను సవిస్తరముగాఁ దెలియఁగోరువారు ఆనందాశ్రమగ్రంథ మాలికలోని దర్శనసంగ్రహమును జూచినచో నన్నియుఁ గర తలామలక మగును.

జూలై నెల 1916 సం॥ త. తే.



శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః.
శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమద్భగవద్గీత.

## అవతారిక.

శ్లో॥ [1]యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః।
వస్తుతాముపయాతోఽహం యామునేయం నమామితమ్॥

---

1. శ్రీయామునాచార్యులు భగవద్గీతార్థము లన్నియు క్రోడీకరించి గీతార్థసంగ్రహ మనునొక సంగ్రహమును రచించియున్నారు. దానిని మార్గప్రదర్శకముగా నుంచుకొనియే రామానుజాచార్యులు గీతకు భాష్యము వ్రాసిరి. మఱియు యామునాచార్యులు రామానుజాచార్యుల యాచార్యపరంపరలో పూర్వులైనవారు గనుక పరమాచార్యులును అగుదురు. ఇంతేకాక ప్రారంభింపఁగోరిన గ్రంథము నిర్విఘ్నముగా పరిపూర్తినొంది వర్ధిల్లుటకు ఆదిని మంగళ మాచరించుటయు నవశ్యము. కనుక యామునార్యులు గీతార్థముల నుపదేశించినవారగుటను వారి ననువర్తించుటవలన స్వాచార్యులకు తృప్తికలుగుటను అనుసంధించి మొదట వారిని స్తుతించి యాపరమాచార్యస్తుతి రూపముగా గ్రంథాదిని జేయు మంగళము నాచరించు చున్నారు:— యత్...కల్మషః:— యత్ = ఎవ్వరియొక్క—యచ్ఛబ్దము ఆచార్యగుణసమృద్ధి సర్వోత్కృష్టమగుట వలనఁ గలిగిన ప్రసిద్ధిని సూచించుచున్నది. పదఅంభోరుహ = పాదారవిందముల యొక్క—ఇట పదములను అంభోరుహములనుటచే అతిభోగ్యములుగా నుండుటయుఁ గాఁబట్టియె వానియందలి ప్రీతిగలుగుటయు తెలియుచున్నది గాన వానిని గూర్చినధ్యానమును ప్రీతిపూర్వకమైన దని సిద్ధించుచున్నది. 'స్నేహపూర్వ మనుధ్యానం భక్తి రిత్యభిధీయతే' అన్నట్లు, అట్టిధ్యానము భక్తిరూపమగుచున్నది. ధ్యాన = అట్టినిరంతరచింతనముచేత—ఇచట ధ్యానశబ్దముచే ద్రోణాచార్యుని చక్కఁ-నుపాసింపక ధ్యానమాత్రముచే సిద్ధినిబొందిన యేకలవ్యునివలె

[1]శ్రియఃపతియు,

తాను యామునాచార్యుల కగుట తెలుపఁబడినది,విధ్వస్త=పటాపంచలు సేయఁబడిన, అశేష=సమస్తములైన, కల్మషః=పాపములు గలవాఁడు- ఒకతూరి చూచినమాత్రనే బహుతరముగా కల్మషములు విధ్వస్తము లగుచున్నవి. నిరంతరస్మరణముచేత అవి సవాసనముగా నిర్మూలము సేయఁబడినవని 'విధ్వస్తాశేషకల్మషః' అన్నారు. ఇట్టి, అహం=నేను, వస్తుతాం=వస్తుత్వమును, ఉపయాతః=పొందితిని - ఎవ్వనిపదారవిందముల ధ్యానించి పాపములనెల్లఁ బోఁగొట్టుకొని నే నొకవస్తు వనఁ దగితినో యనుట. తం=అట్టి,యామునేయం=యామునాచార్యులను,నమామి=నమస్కరించుచున్నాను. దీనిచే స్వాచార్యుల వలెనే ఆయాచార్యులపరంపరనుగూడ అత్యాదరముతో భజింపఁ దగునని శిక్షితమైనది.

1. ఇచట 'నారాయణః పరం బ్రహ్మ గీతాశాస్త్రి సమీరితః' అను యామునార్యుల సంగ్రహప్రథమశ్లోకమున గీతాశాస్త్రమునందెల్ల ప్రతిపాద్యుఁడైనవాఁడు నారాయణుఁడని చెప్పఁబడినది. నార+అయనః = నారములు అయనముగాఁ గలవాఁడు. లేక,నారములకు అయనమైవాఁడు అని వ్యుత్పత్తి. భగవంతుఁడు దివ్యాత్మస్వరూపుఁడు. నారములు అనఁగా అతనిదివ్యాత్మస్వరూపము తప్పతక్కినవి సమస్తము. వానికి అయనము (అనఁగా స్థానమైనది) భగవంతుని స్వరూపము.రామానుజాచార్యులును సంగ్రహశ్లోకము ననుసరించి గీతాప్రతిపాద్యవస్తువగు నారాయణుని ప్రతిపాదింపఁబూని ముందు అయనశబ్దార్థమగు దివ్యస్వరూపమును నిష్కరించి తెలుపుచున్నారు.(శ్రియఃపతియు) శ్రీదేవికి పెనిమిటియైనవాఁడు. 'ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః। నాగపర్యఙ్కముత్సృజ్య హ్యాగతో మధురాంపురీమ్'(హరివంశము, విష్ణుపర్వము ౫౮-౧౦) 'శ్రీదేవికి నిత్యసహచరుఁడై, చేతనాచేతనములు శరీరముగాఁ గలిగియుండుటచే అన్నిటియందును వ్యాపించినవాఁడై పాలసముద్రము వాసముగాఁగల యీభగవంతుఁడు, స్వేచ్ఛావతారంజేసి మనుష్యుల కెల్లవారికి

నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైకతానుఁడును, [2]స్వేతరసమస్త

దృష్టిగోచరుఁడు కాఁగోరి తనశయ్యమైన అనంతుని సంకర్షణరూపముతో మొ టి నవతరింపఁజేసి మధురాపురికి తాను వేంచేసినాఁడు' అని నారాయణునికి దేవితోడి నిత్యసాహచర్యము చెప్పఁబడినది. మఱియు 'అర్థో విష్ణురియం వాణీ.' (విష్ణుపురాణము - ప్రథమాంశము. ౮-౧౮.) 'విష్ణువు అర్థము ఈమె (శ్రీదేవి) వాక్కు-శబ్దము' అని శబ్దార్థములవలె విష్ణువునకును శ్రీదేవికిని నిత్య సంబంధము చెప్పఁబడినది. ఇట్లు నారాయణుఁడు శ్రీతోడినిత్యయోగమువలన స్వరూపసిద్ధముగా శ్రియఃపతియయ్యెను. అనఁగా శ్రియఃపతిత్వము నారా యణునికి స్వరూపములో చేరినదయ్యెను. కనుకనే అతనిస్వరూపమును వివ రించునీపట్టునందు 'శ్రియఃపతి'యని నిరూపించిరి.

1. నిఖిల...తానుఁడును - నిఖిల=సమస్తములైన, (హేయ)త్యాజ్యములైనవానికి, (ప్రత్యనీక)ప్రతిభటమైనట్టి - విరోధియైనట్టిదగు - తీర్థసేవాదులుకూడ కొన్నికొన్ని హేయములను పోఁగొట్టునుగాన అవి గావనుటకై నిఖిలహేయప్రత్యనీక మనఁబడెను, ఇట్టి, (కల్యాణ)మాంగల్యము యొక్క, (ఏకతానః)ఏకాగ్రమైనవాఁడు - కేవలకల్యాణమయుఁడైన వాఁడనుట-లేక, (కల్యాణ) మీఁదఁజెప్పఁబడు కల్యాణగుణములకే, (ఏకతానః) ఆశ్రయమైన వాఁడనియు నర్థము-హేయప్రత్యనీకమైనది ఒకరియందలి హేయములను నిరాకరించునట్టిదో తనయందలి హేయములను నిరాకరింపక సైఁచుట కలుగదు. కనుక హేయశూన్యమును అగునని అర్థమువలన సిద్ధించుచున్నది. ఇచట హేయములకు 'నిఖిల' అను విశేషణము గూర్చుటచే అచిత్తులన్నిటఁ గలుగు వికారాదులును చిత్తులన్నిటను గలుగుక్లేశాదులును సంగ్రహింపఁబడినవి.

2. స్వేతర...స్వరూపుఁడును-త్రివిధములైన చేతనములును అచేతనములును ఒకటివలెనే యొకటి పరాధీనములగును గాన యిట్టిస్వాధీనమగువస్తువు మఱొకటిలేదనెడి యభిప్రాయముతోఁ జెప్పుచున్నారు. (స్వ+ఇతర)తనకంటె ఇతరములైన, (సమస్తవస్తు) సకలపదార్థములకు-సర్వవిధచేతనాచేతనము

వస్తువిలక్షణానన్త జ్ఞానానందైకస్వరూపుఁడును,[1]స్వాభావికానవధికాతిశయజ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజఃప్రభృత్యసంఖ్యేయ

---

లును,(విలక్షణ) వేఱులక్షణములుగలదియు,(అనంత) అంతములేనిదియు-మూఁడువిధములైన పరిచ్ఛేదములులేనిదనుట, (జ్ఞానఆనంద) జ్ఞానమునుఆనందమును అగు - జ్ఞానానందమయమైన, (స్వరూపుఁడును) స్వరూపముగలవాఁడును. 'ఈదేశమందేయున్నది; ఈదేశమందులేదు' అనిదేశపరిచ్ఛేదము. 'ఈకాలమందుఉన్నది; ఈకాలమందులేదు' అనికాలపరిచ్ఛేదము. 'ఇదియిదికాదు' అని వస్తుపరిచ్ఛేదము. ఈమూఁడు పరిచ్ఛేదములు లేనిదై-అనఁగా సర్వదేశసర్వకాలములను వ్యాపించిసర్వవస్తువులందును అంతర్యామియై యుండునదే అనంతము. వస్తుపరిచ్ఛేదము లేనిదియనఁగా పరస్పరము విరుద్ధములుగా నుండు ఆయా వివిధవస్తువులును తానును స్వరూపమునం దొక్కవస్తువేయగు ననికాని, తా నొకటితప్ప తక్కినవస్తువులెల్ల మిథ్యలగు ననికాని గ్రహింపరాదు. సమస్తవస్తువులును ఈశ్వరునికి శరీరము గావునను, సమస్తవస్తువులందును ఈశ్వరుఁడు అంతరాత్మయై వ్యాపించి నియమించుచుండును గావునను, శరీరమును అందలి యాత్మయు రెండును ఏకవస్తువుగానే గ్రహించునట్లు,శరీరభూతమైన యొక్కొక్కవస్తువును అందలి పరమాత్మయగు భగవంతుఁడును చేరి యేకవస్తువేయగుటచే ఒక్కొకవస్తువును భగవంతుఁడే యగుననియు, కావున ఒక్కొక్కవస్తువుపేరును భగవంతునికే చెల్లుననియు, కనుక భగవంతుఁడు తప్పమఱియొక వస్తువులేదనియు, ఈప్రకారము గ్రహించునది. ఇదియే విశిష్టాద్వైతమున వస్తుపరిచ్ఛేదరాహిత్యము. ఇది యీశ్వరునికిని తక్కిన వస్తువులకునుగల శరీరాత్మభావముచేఁ గలిగినది.దీనింబట్టి, ఈశ్వరునితోడ చిత్తులకు జ్ఞానభోగములందు సమత్వము గలిగియు,సర్వప్రకారములందును సమత్వము గలుగ దనుటసిద్ధము.

1. స్వాభావిక...మహోదధియును - ఇందుగుణములు చెప్పఁబడుచున్నవి. ముక్తులకును నిత్యులకును గల జ్ఞానాదిగుణములు పరమాత్మునిసంకల్పమునకు అధీనములైనవి. పరమాత్ముని జ్ఞానాదులు అట్టివి గావనుటకై 'స్వాభావికములు' అనఁగా పరాధీనములుకానివి - అనఁబడినవి. మఱియునవి, నిర

కల్యాణగుణగణ మహోదధియును, ¹ స్వాభిమతానురూపైక

---

(అధిక + అతిశయములు - మేరలేని అతిశయముగలవి. ఈరెండువిశేషణము లచే 'పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే, స్వాభావికీజ్ఞానబలక్రియాచ' (శ్వేతాశ్వతరోపనిషత్తు. ౬-౮.) అనుశ్రుతిప్రతిపాదితములైన పరత్వస్వాభావికత్వములు ప్రతిగుణమునకును గలవని తెలియనయ్యెను. జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజస్సులనెడి గుణములాఱును సమస్తగుణబృందమునందు ప్రధానములగావున కంఠోక్తముగాఁ జెప్పఁబడినవి. తక్కిన సౌశీల్యాది గుణములు 'ప్రభృతి'శబ్దముచే గమ్యములుగా సంగ్రహింపఁబడినవి. మఱియును భగవంతుఁడు జగత్తునకు సంహారమును, సృష్టిని, రక్షణమును జేయుటకై సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు అనువ్యూహములు మూఁటినిబొందును. అందు మొదటివ్యూహమున తత్కార్యమునకుఁ దగునట్లు జ్ఞానబలములును, రెండవ వానియందు ఐశ్వర్యవీర్యములును, మూఁడవదానియందు శక్తితేజస్సులును, పుట్టునుగనుక, ఆక్రమమునుబట్టియు జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తితేజస్సులు అని యీగుణక్రమము ఏర్పఱుపఁబడినది. మఱియుభగవంతుఁడు 'తనంతనే సర్వమును సర్వవిధములచేతను సర్వకాలములందును ప్రత్యక్షముగా తెలియును (జ్ఞానము); అట్లు ప్రత్యక్షముగా తెలిసినసర్వమును ధరించును(బలము); ధరించుమనే నియమించును (ఐశ్వర్యము); ధరించుచును నియమించుచును పటుత్వము చెడకుండును (వీర్యము); అఘటితములను ఘటింపఁజేయును(శక్తి); వానిని ఘటించునప్పుడు మఱొకరిసాహాయ్యమపేక్షింపకయు ఒకరికిని తన్నుక్రిందుపఱుపశక్యముగాకయు, తానేయందఱిని క్రిందుపఱుచును (తేజస్సు); అనెడియీ కార్యక్రమమునుబట్టియు గుణక్రమము ఇట్లు పఠింపఁబడుచున్నది. ఇట్టి జ్ఞానాదిగుణములు,(ప్రభృతి) మొదలుగాఁగల, (అసంఖ్యేయ(లెక్కింపరాని,(కల్యాణగుణగణ) కల్యాణగుణ సమూహములకు, (మహోదధియును) మహాసముద్రమువంటివాఁడును. ఇందు గుణములకు 'అసంఖ్యేయ' మనియు 'మహోదధి' మనియుఁ జెప్పుటచే 'యథారత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక! తథాగుణాహ్యనన్తస్య అసంఖ్యేయా మహాత్మనః'(వామనపురాణము.౭౪-౪౦.)ఇత్యాదులు తలంపునకు వచ్చుచున్నవి.

1. స్వాభిమత ... దివ్యరూపుఁడును-ఇందు విలక్షణవిగ్రహయోగము చెప్పఁబడుచున్నది. (స్వ అభిమత అనురూప) తనకు అభిమతమైనదియు అను

రూపాచింత్య దివ్యాద్భుత నిత్యనిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌందర్య సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంత గుణనిధి దివ్యరూపుండును, [1] స్వోచిత వివిధ విచిత్రానంతాశ్చర్య నిత్యనిరవద్యాపరిమిత దివ్య భూషణుండును, స్వానురూపాసంఖ్యేయాచింత్యశక్తి నిత్య నిరవద్య

రూపమైనదియు-అభిమతమైనను అనురూపముగాకయు అనురూపమైనను అభిమతముగాకయు లోకమున నుండుట గలదుగాన రెండునైనదిగా చెప్పఁబడెను. (ఏకరూప) ఎప్పుడును ఒక్కరీతి నేయుండునదియు-వ్యూహవిభవాదులైన అవస్థలందును విగ్రహమునకు హేయప్రత్యనీకత్వము ఆనందావహత్వము మొదలైన స్వభావములు వీడకుండునను. (అచింత్య) చింతింపఁ దరముకానిదియు, (దివ్య) పరమాకాశమందు వర్తించునదియు, (అద్భుత) ఆశ్చర్యమైనదియు - వటపత్రశయన విశ్వరూపాదులచేత ఆశ్చర్యమైనదనుట, (నిత్య) నిత్యమైనదియు, (నిరవద్య) జర మొదలగు దోషములులేనిదియు, (నిరతిశయ, ఔజ్జ్వల్య, సౌందర్య, సౌగంధ్య, సౌకుమార్య, లావణ్య, యౌవన, ఆది) క్రమముగ మించిన ఉత్కృష్టమైనదిలేనట్టివగు, నిగనిగమను కాంతి, అవయవశోభ, మంచివాసన, మహాబలముండియుఁ బువ్వువలె మెత్తందనము, సముదాయశోభ, యౌవనము మొదలగు, (అనంతగుణనిధి) లెక్కలేని గుణములకు పాత్రమైనదియు, (దివ్య) అప్రాకృతమైనదియు, అగు, (రూపుండును) విగ్రహముగలవాఁడును-ఇట ఔజ్జ్వల్యము మొదలైవానిచే శుభాశ్రయత్వమునకును భోగ్యత్వమునకును అనువైన మంగళగుణములు చెప్పఁబడెను. 'సుకుమారౌ మహాబలౌ' (రామాయణము) అని మహాబలత్వముతోడి సౌకుమార్యము తెలియునది.

1. స్వోచిత...భూషణుండును-స్వరూపమును దానిగుణములును విగ్రహమును దానిగుణములును జెప్పి విగ్రహమందున్న ఆభరణవర్గమును ఆయుధవర్గమును తెలుపుచున్నారు. (స్వఉచిత) అట్టివిలక్షణవిగ్రహముతోఁ గూడిన స్వరూపమునకుఁ దగినట్టియు (వివిధ) హారకిరీటాదిరూపముచే నానావిధములైనవి (విచిత్ర) బంగారు మణులు మొదలగువానిచే విచిత్రములైనవియు, (అ

నిరతిశయ కల్యాణ దివ్యాయుధుండును, [1]స్వాభిమతానురూప నిత్యనిరవద్య స్వరూప గుణ విభ వైశ్వర్య శీ లాద్యనవధికాతి శయాసంఖ్యేయ కల్యాణ గుణ గణ శ్రీవల్లభుండును,

---

వంతాశ్చర్య) కొలఁదిలేని ఆశ్చర్యమునుగలిగించునవియు, (నిత్యనిరవద్య) నిత్యములును నిరవద్యములునైనవియు, (అపరిమిత) లెక్కలేనివియును, (దివ్య) అప్రాకృతములైనవియు అగు, (భూషణుఁడును) భూషణములుగలవాఁడును— (స్వఅనురూప) తనకు తగినట్టివియు, (అసంఖ్యేయ) లెక్కింపఁ దరముకానివియు, (అచింత్యశక్తి) ఎన్నవలవికానిశక్తిగలవియు-గొడ్డండ్రు గడ్డపాఱలు మొదలగు పెక్కింటిచేతఁ గష్టపడి చేయవలసిన సాలపర్వత భూతలవిదళనమును ఒక్కబాణముచేతనేకదా రామావతారమున చేసినాఁడు. కనుక వానిశక్తి అచింత్యమనుట, (నిత్యనిరవద్య) ములైనవియు, (నిరతిశయకల్యాణ) నిరతిశయానందము గూర్చునవియు, (దివ్య) మైనవియునగు (ఆయుధ) ములుగలవాఁడును.

1. స్వాభిమత...వల్లభుండును-పూర్వము భగవంతునిస్వరూపము నిరూపించుటకై సామాన్యముగా శ్రీదేవిని జెప్పి యిపు డతనివిభూతినడుమను నెలకొనియున్న యాదేవిని విశేషించి తెలుపుచున్నారు. (స్వఅభిమత అనురూప నిత్య నిరవద్య) ములైనవియగు, (స్వరూప) దివ్యాత్మస్వరూపమును, (రూప) దివ్యవిగ్రహమును, (గుణ) నిరతిశయౌజ్జ్వల్యసౌందర్యాదులగు విగ్రహగుణములును, (విభవ) పరిజనము మొదలైనవిభవమును, (ఐశ్వర్యశీల ఆది, అనవధికాతిశయ, అసంఖ్యేయ, కల్యాణ, గుణగణ) ఐశ్వర్యము శీలము మొదలుగాఁగలవియు, మితిలేని అతిశయముగలవియు, లెక్కింపరానివియు, మంగళకరములైనవియునగు, గుణములయొక్క సమూహమును), గల, (శ్రీ) లక్ష్మీదేవికి, (వల్లభ) చెలువుఁడయినవాఁడును- శ్రీదేవికిఁగల స్వరూపమును, రూపమును, రూపగుణములును, విభవమును, ఐశ్వర్యాదిగుణగణమును ఈమైదును భగవంతుఁడగుతనకు అభిమతములును అనురూపములును నిత్యములును నిరవద్యములు నగునని యర్థము. లక్ష్మీస్వరూపము నిర్వికారమై సర్వకాలవర్తియగుటచే నిత్యమైనది; జరాదులులేమిచే నిరవద్యమైనది; భగవంతుని స్వరూపము

[1]స్వసంకల్పాను విధాయి స్వరూపస్థితి ప్రవృత్తిభేదా శేష శేష

వలె కల్యాణైకతానత్వాదులు గలిగియుండుటచే అనురూపమైనది. రూపము (విగ్రహము) పరమపదమునం దున్నట్టిదే అవతారాదిదశలయందు నుండుటచే నిత్యమైనది. అది 'అస్యాదేవ్యా యథారూప మజ్గప్రత్యజ్గసౌష్ఠవమ్ । రామస్యచయథారూపం తస్యేయమసితేక్షణా' 'విష్ణోర్దేహానురూపాం వైకరోత్యే షాత్మన స్తనుమ్' అన్నట్లు అనురూపమైనది. విగ్రహగుణములు ఒకప్పుడును కొఱవడకుండుటచే నిత్యములు; ముడుతలు, కొలుపుట మొదలగు దోషములు లేమిచే నిరవద్యములు. విభవము 'దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవాన్ హరిః। స్త్రీనామ్నీ లక్ష్మీర్మైత్రేయ నానయోర్విద్యతేపరమ్' అన్నట్లు అనురూపమైనది. ఈశ్వరుని ఐశ్వర్యాదులే అనవధికాతిశయములుగాన లక్ష్మియైశ్వర్యాదులును అట్టివగుటయెట్లు? అన్నచో లక్ష్మియైశ్వర్య మీశ్వరుని కభిమతముగాన దోషములేదు. 'అస్యేశానా జగతో విష్ణుపత్నీ 'అని విష్ణుపత్నీత్వవేషముననేకదా సమస్తజగమును ఏలుచున్నది. ఐశ్వర్యము నిగ్రహాదిప్రసక్తి లేమిచే నిరవద్యమైనది. నిగ్రహాదులు పురుషుని కనురూపములుగాన యామెవల్లభుని భాగమేయగును. శీలమనఁగా మహత్త్వముండినను మందులతో గుత్తముగాఁ గలసిమెలసి యుండుటగదా. అట్టియెడల తనయుత్కర్షను ఒకప్పుడును తెలుపకుండుటయే ఆశీలముయొక్క నిత్యత్వము. అది 'తుల్యశీలవయోవృత్తామ్' (రామాయణ) అన్నట్లు అనురూపమైనది.

1. స్వసంక...చరణయుగళము గలవాఁడును - ఇట నిత్యపరిజన విశిష్టత్వమును జెప్పుచున్నారు. (స్వసంకల్ప అనువిధాయి) తనసంకల్పమును అనుసరించి నడచునట్టివైన, (స్వరూపస్థితిప్రవృత్తిభేద) ములుగలవారును, (అశేష శేషతా ఏకరతిరూప) సమస్తమైన శేషవృత్తియందే ముఖ్యముగా (అవలంబించి) యున్నప్రీతియే స్వభావముగాఁ గలవారును - సర్వవిధకైంకర్యములను జేయుటయందే వారికి ప్రీతి. అది మఱియొక్కటియందును గలుగదు-ఆప్రీతియెవారికి స్వభావమని యర్థము, (నిత్య) నిత్యులును-ముక్తులవలె ఒకప్పుడు స్వరూపాదులు సంకోచించియుండిన వారుగారు- నిత్యమును సంకోచింప

త్రైకరతిరూప నిత్యనిరద్య నిరతిశయజ్ఞానశక్తిక్రియైశ్వర్యాద్య నంత గుణగణాపరిమిత సూరులచేత ననవరతము స్తుతింపఁబడు చుండు చరణయుగళము గలవాఁడును [1] వాఙ్మనసాపరిచ్ఛేద్య

---

కుండు జ్ఞానాదిగుణములు గలవారనుట. (నిరవద్య) క్లేశముకర్మము స్వాతంత్ర్య ము అభిమానము మొదలైనదోషములులేనివారును, (నిరతిశయ) ముఖ్యమైన,(జ్ఞాన శక్తి క్రియా ఐశ్వర్య ఆది అనంతగుణగణ) ములుగలవారును, (అపరిమిత) కొలఁ దిలేనివారును అగు, (సూరు) లు చరణయుగళము నెల్లప్పుడును స్తుతించుచుం దురనియర్థము. నిత్యసూరుల స్వరూపస్థితి ప్రవృత్తులు పరమాత్మని సంకల్పము నకు లోనయిన వనఁగా అతనినిచ్ఛచేత సిద్ధించినవనుట. అతని కిచ్ఛ లేకపో యెనా వానినెల్లమరలఁ దీసికొనఁజాలును. కాని యట్లిచ్ఛ లేకపోవుట యెుక ప్పుడును సంభవింపదు. ఆయిచ్ఛ నిత్యమైనది. పరమాత్మసంకల్పమునకు లోన యినస్వరూపస్థితి ప్రవృత్తులుగలిగియుండుట బద్ధముక్తప్రకృతిప్రాకృతకా లాదులన్నింటను సమానము. అశేషశేషతయనఁగా భగవంతుని కభిమతమైన ఆకారములెల్లఁ గలిగియుండుట. 'శరా నానావిధాశ్చాపి ధను రాయతవిగ్ర హమ్। అన్వగచ్ఛ_న్త కాకుత్స్థం సర్వేపురుషవిగ్రహాః' 'నివాసశయ్యాసనపా దుకాంశు కోపధాన వర్షాతపవారణాదిభిః। శరీరభేదై స్తవశేషతాం గతై ర్యథోచితం శేషఇతీరితే జనైః॥ ఇత్యాదులు తెలియదగినది. వారిజ్ఞానక్రియైశ్వ ర్యాదులు నిత్యనిరవద్యనిరతిశయములు· జ్ఞానము నిరతిశయమనఁగా పరమాత్మ జ్ఞానముతో సాటియైనదనుట. క్రియ నిరతిశయమనఁగా స్వచ్ఛందానంతకైం కర్యమైయుండుట. ఐశ్వర్యము నిరతిశయమైన దనఁగా తమయిచ్ఛచేతఁ గయికొనెడి ఆయాశరీరేంద్రియాదులను నియమించుటయందు అడ్డులేకయుం డుట-వానిని ఏయడ్డియులేక తలఁచినట్లెల్ల భగవత్కైంకర్యమునకై నియమిం చుట యని భావము కాని యన్నిటియందును అది గలిగియుండుటకాదు.ఇదియే 'జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ' అని సూత్రింపఁబడెను. ఇట్టిసూరులే 'సదాపశ్యన్తిసూరయః, తద్విప్రాసోవిపన్యవో జాగృవాంసః సమిన్ధతే' అనిప్రతిపాదింపఁబడిరి. విపన్యవులనఁగా విశేషించి స్తుతిశీలురు.

1. వాఙ్మ...స్వభావుండును. (వాచ్ మనస) వాక్కునకును మన

స్వరూప స్వభావుండును [1] స్వోచిత వివిధ విచిత్రానంతభోగ్య భోగోపకరణ భోగస్థాన సమృద్ధానంతాశ్చ ర్యానంతమహా విభ వానంతపరిమాణ నిత్యనిరవ ద్యాక్షర పరమవ్యోమనిల యుండును, [2] వివిధ విచిత్రానంత భోగ్యభోక్తృవర్గ పరిపూర్ణ

---

స్సునకును,(అపరిచ్ఛేద్య)ఇంతయని కొలఁది యిడరాని,(స్వరూపస్వభావ)ములు గలవాఁడు. స్వరూపస్వభావములు కొలఁదియిడరానివే కాని తెలియరానివి గావు. తెలియరాని వన్న యెడల 'తద్విజిజ్ఞాసస్వ' 'మనసాతు విశుద్ధేన' 'బ్రహ్మవిత్' 'ఆనన్దంబ్రహ్మణో విద్వాన్' ఇత్యాదులగు వేదకశ్రుతులకు విరుద్ధమగును. 'యతోవాచోనివర్తన్తే అప్రాప్యమనసాసహ' ఇత్యాదులూహ్యము.

1. స్వోచిత...నిలయుండును - ఇందువాసస్థాన మగు నిత్యవిభూతిని జెప్పుచున్నారు. (స్వ ఉచిత) తనకు తగినదియు, (వివిధవిచిత్ర) ములైనవియు, అగు (భోగ్యభోగోపకరణ భోగస్థాన)ములచేత-భోగ్యములనఁగా శబ్దాది విషయములు, భోగోపకరణములనఁగా భోగమునకు సాధనములైన దేహేంద్రియాదులు, భోగస్థానములనఁగా సౌధారామ ప్రదేశములు, ఇట్టివానిచేత, (సమృద్ధ) నిండినదియు, (అనంతాశ్చర్య) మైనదియు,(అనంతమహావిభవ) ములు గలదియు- విభవములనఁగా వాహనరత్నాదులు, (అనంతపరిమాణ) ముగలదియు - అడ్డముగాను మీఁదుగాను దానికి కొలఁదియుమేరయు లేదు; క్రిందమాత్రము ప్రకృతినిబట్టిదానికి మేరకలదు, (నిత్య) ప్రాకృతాకాశమువలె లయములేనిదియు, (నిరవద్య) శుద్ధసత్త్వమయమగుటచేత రజస్తమస్సులును వానికార్యములును లేనిదియు, (అక్షర) మైనదియు- దాని కేయంశమందుఁగాని సృష్టిసంహారములులేవనుట, అగు, (పరమవ్యోమనిలయుఁడు) పరమాకాశము- పరమపదము- వాసస్థానముగాఁ గలవాఁడు.

2. వివిధ...లీలుఁడును - ఇందు లీలావిభూతి యోగమును జెప్పుచున్నారు. (వివిధవిచిత్ర) ములును, (అనంత) ములునగు, (భోగ్యభోక్తృవర్గ) ములచేత. (పరిపూర) మైన, (నిఖిలజగత్ ఉదయవిభవలయ) సమస్తజగము

నిఖిల జగదుదయ విభవ లయ లీలుండును [1] పరబ్రహ్మము ను పురుషోత్తముఁడును నగునారాయణుఁడు బ్రహ్మమొదలు కొని స్థావరములవఱకుఁగల సమస్తజగత్తును సృజించి, నిజ స్వరూపముతో నెలకొనియున్నపుడు బ్రహ్మాది దేవతలకును మను ష్యులకును ధ్యానారాధనములకు అగోచరుఁడగుటంబట్టి [2] అ పారకారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్య మహోదధి గావున

---

యొక్క ఉత్పత్తియు స్థితియు లయమును అనెడి, (లీలలుగలవాఁడును. భోగ్యములు శబ్దస్పర్శాది రూపముచే వివిధములు; దివ్యాదివ్య భేదముచే విచిత్ర ములు. భోక్తృవర్గము దేవమనుష్యాదిభేదముచేత వివిధము; వర్ణాశ్రమాది భేద ములచేత విచిత్రము. పరమపదమందు భోక్తృవర్గమునకు జ్ఞానసుఖాదితారత మ్యములేనందున వారికి వివిధత్వము చెప్పఁబడదయ్యె. లీలావిభూతియందును భోగోపకరణభోగస్థానములు గ్రాహ్యములు. జగదాకారముగా తాను ఉద యాదులు పొందుటయె లీలలు. జగదాకారముగాఁ బరిణమించినచో వికారి కాఁడా యనఁగా సూక్ష్మచిదచిద్విశిష్టుఁడైయ్యే యట్టి వికారమును బొందు చున్నాఁడు గాని స్వరూపముచేతఁ గాదు; కాన నిర్వికారుఁడే యగును. బాలు నికి యౌవనాదులు కలిగినపుడు స్వరూపమునకు వికారముగలుగనట్లే భగవం తునికి జగదాకారత్వాదులందును స్వరూపవికారము లేదని తెలియునది. అవాప్త సమస్తకామునకు జగద్వ్యాపారమేలయనఁగా లీలనుబట్టియని లీలాశబ్దము.

1. బ్రహ్మలక్షణములతోఁ గూడియుండుటచే నారాయణుఁడే పర బ్రహ్మమని 'నారాయణ పరంబ్రహ్మ' 'నారాయణః పరంబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః' ఇత్యాదులచొప్పున నిట ప్రతిపాదించిరి. ఈమూఁడును కృష్ణునకు ను చెల్లునని 'పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమంభవాన్' 'ప్రథితః పురు షోత్తమః' 'ఏష నారాయణః శ్రీమాన్' ఇత్యాదులచేతఁ దెలియునది. సర్వసా మానాధికరణ్యమును సర్వవైలక్షణ్యమును సర్వాంతర్యామిత్వముచేత ఉప పన్నమని యీమూఁడుపదముల యభిప్రాయము.

2. తన కేప్రయోజనములేకుండఁగా అవతారములెత్తనేల యనఁగా

[1]తనస్వభావమును విడువకయే [2] తనరూపమునే ఆయావానికి సజాతీయ మగుసంస్థానము గలదిగా గావించుచు ఆయాలోకములం [3]దవతరించి అవతరించి వారివారిచే ఆరాధితుండై వారివారి యిష్టమునకుం దగినట్టు ధర్మార్థ కామ మోక్షము లను ఫలముల నొసంగుచు [4] భూభారమును దింపు నెపమున, అస్మదాదులకుం గూడ మిక్కిలి యాశ్రయింపందగియుండుటకు భూమియందు

'అపార...దధి' అనంబడెను. కారుణ్యమనంగా తనప్రయోజనమేమియుం గోరక పరులదుఃఖములకు తాళకుండుట. మిక్కిలిగొప్పతనమున్నను తక్కువవారితోడ గుత్తముగా కలసి మెలసి యుండుట సౌశీల్యము. పరులదోషములను నిరసించి పాటింపని స్వభావము గలిగి యుండుట వాత్సల్యము. వత్సస్య ఇదం వాత్సం తత్ లాతీతి వాత్సలా తత్స్వభావం వాత్సల్యమ్ అని వ్యుత్పత్తి. ఆవు తనదూడ దేహమునందలి ముఱికినిగూడ భోగ్యముగా నాకుట వాత్సల్యము. పిశాచగోపాలగోపికాదులకు తన్నేయిచ్చుకొన్నను ఏమియిచ్చితిమని భావించుట ఔదార్యము. ఈగుణములు ప్రేరింపంగా అవతరించుచున్నాండు.

1. 'అజోఽపిసన్నవ్యయాత్మా' ఇత్యాదు లిందులకుం బ్రమాణములు.

2. దీనిచే అవతార విగ్రహముకూడ అప్రాకృతమగు పరమపదమందలి విగ్రహముయొక్క అంశవిశేషమెయని తెలియునది. ఇదియె 'న తస్యప్రాకృతామూర్తిర్మాంసమేదోఽస్థిసమ్భవా' 'నభూతసంఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః' ఇత్యాదులచే నెఱుంగునది.

3. 'యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత' 'సంభవామి యుగేయుగే' 'బహూనిమేవ్యతీతాని జన్మాని' ఇత్యాదులెఱుంగునది. వారిచే ఆరాధింపంబడుట. 'యస్యావతారరూపాణి సమర్చన్తి దివౌకసః । అపశ్యన్తః పరంరూపమ్' ఇత్యాదులచె ప్పనం దెలియునది.

4. అవతారమునకు భూభారమును దింపుట వ్యాజమాత్రము. అందఱకు ఆశ్రయణీయుండగుటయె సాక్షాత్తయిన ఉద్దేశ్యము. దుర్జనులనాశము నేగూడ సాదరక్షణ మనుమహాప్రయోజనమును సంబంధించినదిగదా. అస్మ

అవతరించి, సకలమనుజుల నయనములకు విషయభూతుఁడగుచు, పరావరు లగునిఖిలజనుల మనస్సులను నయనములను హరించునట్టి దివ్యచేష్టితములను గావించుచు, పూతనా శకట యమలార్జు నారిష్ట [1] ప్రలంబ ధేనుక కాలియ కేశి కువలయాపీడ చాణూర ముష్టిక తోసల కంసాదులను వధించి, [2] అనవధికదయా సౌహార్దానురాగ గర్భములగు విలోక నాలాపామృతములచేత విశ్వమును ఆప్యాయితముచేయుచు, [3] నిరతిశయ సౌందర్య సౌశీల్యాది గుణగణములను వెలిపుచ్చుటచేత

---

దాదులనఁగా అయోగ్యులైనవారనుట. మహాయోగుల పరిశుద్ధమనస్సుచేత గ్రహింపఁ గష్టమైనవాఁడు సౌలభ్యాతిశయముచేత మనుష్యులకును-అందునుగొల్లవారలవలెకును-మాంసంపుఁగన్నులకుఁ గ్రహింపఁదగినవాఁడయ్యె ననిభావము. ఇట్లవతరించుటకును కన్నులకగపడుటకును ప్రయోజనము కేవలము ఆరాధింపఁదగియుండుట మాత్రముగాదు; అనుభవింపఁదగియుండుటయు నగుననియె 'పరావర' ఇత్యాదులు చెప్పఁబడెను. పరులనఁగా ఉపాసనసమర్థులగు బ్రహ్మరుద్రభీష్మాక్రూరాదులు. అవరులనఁగా గొల్లలుమొదలగువారు. నిఖిలజనులనఁగా స్త్రీపుంసాది విభాగములేక 'పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' అన్నట్లుండుట తెలియునది. దివ్యచేష్టితములు నవనీత నటనాదులు.

1. బలభద్రుఁడు భగవదంశరూపమే కాన యతఁడు చేసిన ప్రలంబ ముష్టికాదివధము భగవంతుండు చేసినదిగానే యిచట చెప్పఁబడెను.

2. ప్రియతముని స్వరూపమును దర్శించుట ధారకము. వానిచేష్టితములను దర్శించుట పోషకము. వానితోడ ఆలాపాదులుచేయుట భోగప్రకారము. సౌహార్ద మనఁగా హితమునుగోరుస్వభావము. అనురాగ మనఁగా ప్రీతి.

3. ధర్మసంస్థాపనము తనయారాధ్యమగు స్వరూపము యొక్కదర్శనముచేతను, దేశకాలములచేత దూరస్థులగువారికి పరంపరచే ననుగ్రహించునట్టి యుపదేశముచేతను, గావించుట తెలుపుచున్నారు.

అక్రూర మాలాకారాదులను బరమభాగవతులను గావించి, [1]పాండుతనయుని యుద్ధమునకు పురికొల్పువ్యాజముచేత పరమ పురుషార్థలక్షణమగు మోక్షమునకు సాధనముగా వేదాంత మునందు చెప్పఁబడినదియు స్వవిషయమైనదియు జ్ఞానకర్మసాధ్య మైనదియు నగు భక్తియోగము నవతరింపఁ జేసినవాడయ్యె. [2]అందు పాండవులకును కురువులకును యుద్ధము ప్రారంభింపగా [3]ఆభగవంతుఁడు పురుషోత్తముఁడు సర్వేశ్వరేశ్వరుఁడు జగ దుపకృతిమర్త్యుఁడు ఆశ్రితవాత్సల్యవివశుఁడై పార్థుని రథిగా ను తన్ను సారథిగాను సర్వలోకసాక్షికముగాఁ జేసెను. [4] ఇట్లగుట తెలిసియు సర్వవిధముల నంధుఁడగు ధృతరాష్ట్రుఁడు సుయోధనుని విజయము తెలియఁగోరి సంజయు నడిగెను.

1. ఇందు శ్రీమద్గీతాశాస్త్రోపదేశముతోడి సంగతిని దెలుపఁబడినది.

2. ఇందు గీతాశాస్త్రమునకు ఉపోద్ఘాతము గూర్చిరి.

3. అవతారదశయందును పూర్ణత్వమును స్వచ్ఛందత్వమును మొద లగునవి 'ఆభగ...శ్వరుఁడు' అనుపదములనే ప్రతిపాదింపఁబడెను. వీనిచేత పరత్వమును 'జగ...వివశుఁడు' అనిసౌలభ్యమును సంగ్రహింపఁబడినవి. జగదు పకారమునకు మర్త్యుఁడైనను ఉత్కృష్టచరిత్రమును మాని నికృష్టసారథ్యమును చేయ నేలయనఁగా 'ఆశ్రి...వివశుఁ' డనఁబడెను. పార్థశబ్దముచేత వాత్సల్యమున కుపయుక్తమగు లౌకికసంబంధము చెప్పఁబడినది. మేనత్తయగు పృథకొడు కు గదా పార్థుఁడు. ఈనికృష్టకృత్యము సిగ్గుపడి రహస్యమునఁ జేయలేదనుటకై 'సర్వలోకసాక్షికముగా' (లోకులెల్లఁజూచుచుండఁగా) అనఁబడెను.

4. శ్రియఃపతి యిత్యాదులను తెలిసియు ననుట. కనులచేతనే కాక యిహపరములందలి హితములను తెలియని మనస్సుచేతనుగూడ అంధుఁడు గాన సర్వవిధములచేత అంధుఁ డనఁబడెను.



## శ్రీభగవద్గీతా - ప్రథమోఽధ్యాయః.

### అర్జునవిషాదయోగః

---

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు పలికెను.

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ ॥ 1

టీ. హేసఞ్జయ = ఓసంజయుఁడా, ధర్మక్షేత్రే = ధర్మమున కు నమైన - యుద్ధమనెడి యజ్ఞమునకు తగినదైన, కురుక్షేత్రే=కురుక్షేత్రమునందు, (పాండవులకును కౌరవులకును కూటస్థపురుషుఁ కురువు, ఆకురువు పేరితోఁ గూడినదగుటచే కురుక్షేత్రము ఆ రు తెగలవారికిని బహుమానపాత్రమైనదని భావము), యుయుత్సవః=యుద్ధము చేయఁ గోరువారై, సమవేతాః=కూడిన-ఒకరి కరు ఎదిరిపన్నిన, మామకాః = (దుర్యోధనుఁడు మొదలగు) నావారును, పాణ్డవాశ్చైవ=(ధర్మరాజాదులగు) పాండవులును, ఏమి, అకుర్వత=చేసిరి.

తా. ఓసంజయా, పుణ్యక్షేత్రమగు కురుక్షేత్రమునందు యుద్ధము సేయునిచ్ఛతోఁగూడిన దుర్యోధనాదులగునావారును ధర్మరాజాదులగుపాండవులును ఏమిచేసిరి.

ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని జయముఁ దెలియఁగోరి యిట్లు అడుగఁగా సంజయుఁడు అందులకు 'యత్రయోగేశ్వరఃకృష్ణో యత్ర

పార్థో ధనుర్ధరః। తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతి ర్మతిః
మ' అని యీయుత్తరమును జెప్పఁ బోవువాఁడై దీనిని స.
ర్థించుటకు పలసినయువాంతరవృత్తాంతమును 'దృష్ట్వాతు' ఇ
చెప్పుచున్నాఁడని తెలియునది.

సఞ్జయ ఉవాచ = సంజయుఁడు చెప్పెను.

శ్లో॥ దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముపసఙ్గమ్య రాజా వచన మబ్రవీత్॥

టీ. తదా=అప్పుడు, రాజా=రాజయిన, దుర్యోధనః= దుర్యో
నుఁడు, వ్యూఢం=వ్యూహములుగా తీరియున్న, పాణ్డవానీకం
పాండవులసేనను, దృష్ట్వా = చూచి, ఆచార్యం =ద్రోణాచార్యు
ఉపసఙ్గమ్య=సమీపించి, వచనం=చెప్పఁబోవువాక్యమును, అ
వీత్ =పలికెను.

తా. అప్పుడు రాజైనదుర్యోధనుఁడు వ్యూహములుగా తీ
యున్న పాండవబలముం జూచి ద్రోణాచార్యునియొద్దకుఁ బోం
యీప్రకారము చెప్పెను.

శ్లో॥ పశ్యైతాంపాణ్డుపుత్రాణామాచార్యమహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥

టీ. హే ఆచార్య=ఓ ఆచార్యుఁడా, ధీమతా=బుద్ధిమంతుఁ
ను, తవ=నీకు, శిష్యేణ=శిష్యుఁడునగు, ద్రుపదపుత్రేణ=ద్రుప
రాజకుమారుఁడైన ధృష్టద్యుమ్నునిచేత,వ్యూఢాం=వ్యూహము
గా తీర్పఁబడినదియు, మహతీం=గొప్పదియునగు, పాండుపుత్రా
ణాం=పాండవులయొక్క, ఏతాం=ఈ, చమూం=సేనను, పశ్య
చూడుము.

రామానుజభాష్యము—"దుర్యోధనుఁడు పాండవా సే

తా. ఓ ఆచార్యా, బుద్ధిమంతుఁడును నీ శిష్యుఁడును అయి ధృష్టద్యుమ్నునిచే వ్యూహాకారముగా రచింపఁబడినదై గొప్పయగు నీపాండవబలముఁ గనుంగొనుము.

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ 4
ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్।
పురుజి త్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః॥ 5
యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥ 6

టీ. అత్ర=ఈపాండవసేనయందు, శూరాః=శూరులును, మహేష్వాసాః=గొప్పవిలుకాండ్రును, యుధి=యుద్ధమునందు, భీమార్జునసమాః=భీమార్జునులతో సమానులునగు, యుయుధానః=సాత్యకియు, విరాటశ్చ=విరాటరాజును, *మహారథః=మహారథుఁడగు, ద్రుపదశ్చ=ద్రుపదమహారాజును, ధృష్టకేతుః=ధృష్టకేతువును, చేకితానః=చేకితానుఁడును, వీర్యవాన్=పరాక్రమవంతుఁడైన, కాశీరాజశ్చ=కాశీరాజును, పురుజిత్=పురుజిత్తును, కున్తిభోజశ్చ=కుంతిభోజుఁడును, నరపుఙ్గవః=మనుజశ్రేష్ఠుఁడగు, శైబ్యశ్చ=శైబ్యుఁడును, విక్రాన్తః=శూరుఁడైన, యుధామన్యుశ్చ=యుధామన్యువును, వీర్యవాన్=పరాక్రమవంతుఁడగు, ఉత్తమౌజాశ్చ=ఉత్తమౌజుఁడును, సౌభద్రః=అభిమన్యుఁడును, ద్రౌపదేయాశ్చ=(ధర్మజభీమా-

* ఏకో దశసహస్రాణి యోధయే ద్యస్తు ధన్వినామ్। శస్త్రశాస్త్రప్రవీణశ్చ మహారథ ఇతి స్మృతః॥ అనగా, ఎవఁడు ఆయుధవిద్యయందు నిపుణుఁడై పదివేలవిలుకాండ్రతో తానొక్కఁడే యుద్ధము చేయ సమర్థుఁడో వాఁడు మహా-

ర్జున నకులసహదేవులకు వరుసగా) ద్రౌపదియందుఁ బుట్టిన ప్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులును, సర్వే=అందఱును, మహారథా ఏవ=మహారథులేయైనవారు, (సన్తి=కలరు.)

తా. ఈ పాండవసేనయందు శూరులును మేటివిలుకాండ్రును యుద్ధములో భీమార్జునులకు సమానులును నగుసాత్యకి, విరాటరాజు, మహారథుఁ డగుద్రుపదుఁడు,ధృష్టకేతువు. చేకితానుఁడు, పరాక్రమవంతుఁడైనకాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు,పురుషశ్రేష్ఠుఁడైనశైబ్యుఁడు, శూరుఁ డగుయుధామన్యువు, వీర్యవంతుఁడైనఉత్తమౌజస్సు,అభిమన్యుఁడు, ప్రతివింధ్యాదులైన యుఃపాండవు లేవురును అందఱును మహారథులే యై యున్నవారు

శ్లో॥ అస్మాకంతు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥

టీ. హేద్విజోత్తమ=బ్రాహ్మణోత్తముఁ డగుద్రోణాచార్యా! అస్మాకంతు = మనవారిలోపల, యే=ఎవరు, విశిష్టాః=ముఖ్యులో మమ=నాయొక్క, సైన్యస్య=సేనకు, నాయకాః = అధిపతులో తాన్=వారిని, నిబోధ=తెలిసికొనుము, తాన్=వారిని, తే=నీక సంజ్ఞార్థం=చక్కఁగా తెలియుటకొఱకు,బ్రవీమి=చెప్పుచున్నాన

తా. ద్రోణాచార్యా, మనబలంబున నెవరు ముఖ్యులో నాసైన్యమునకు నెవ రధిపతులో వారిని దెలిసికొనుము. మీ చక్కఁగా తెలియుటకై వారిని జెప్పెదను.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ॥
అన్యేచ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః।

---

[illegible]

నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥ 9

టీ. భవాన్=మీరు, భీష్మశ్చ = భీష్ముఁడును, కర్ణశ్చ=కర్ణుఁడు, కృపశ్చ = కృపాచార్యుఁడును, సమితిఞ్జయః = యుద్ధమందు జయశీలుఁడగు,అశ్వత్థామా=అశ్వత్థామయు, వికర్ణశ్చ=వికర్ణుఁడు, తథైవ=అట్లే, సౌమదత్తిశ్చ = సోమదత్తుని కుమారుఁడగు భూరిశ్రవుఁడును, అన్యే=ఇతరులగు, బహవశ్శూరాశ్చ= అనేకశూరులును,మదర్థే=నాకొఱకు, త్యక్తజీవితాః=ప్రాణములను విడుచుటకు నిశ్చయించుకొనినవారు, సర్వే=అందఱును, నానాశస్త్రప్రహరణాః=అనేకవిధములగుఆయుధములును యుద్ధసాధనములును గలవారును, యుద్ధవిశారదాః=యుద్ధమునందు నేర్పుగలవారును, (సన్తి=ఉన్నారు.)

తా. మీరును, భీష్మాచార్యుఁడును, కర్ణుఁడును, కృపాచార్యుఁడును, యుద్ధమున జయశీలుఁడగునశ్వత్థామయు, వికర్ణుఁడును, భూరిశ్రవుఁడును, మఱియును జయద్రథుఁడు మొదలగుననేకశూరులు నందఱును యుద్ధసమర్థులై నాకొఱకు ప్రాణములను విడుటకు నిశ్చయించుకొని నానాశస్త్రాస్త్రసంపన్నులై యున్నవారు.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ 10

టీ. తత్ =కాఁబట్టి, భీష్మాభిరక్షితం=భీష్మునిచే రక్షింపఁబడుచున్న, అస్మాకం= మనయొక్క, బలం = సేన, అపర్యాప్తం=చాలకున్నది, భీమాభిరక్షితం=భీమునిచే రక్షింపఁబడుచున్న, ఏతేషాం=ఈ పాండవులయొక్క, ఇదం బలం = ఈసైన్యము, పర్యాప్తం=చాలియున్నది.

---

...ను తానే చూచి తను గెలుచుట కాబలము చాలియుండుట

తా. * కాఁబట్టి భీష్మునిచే కాపాడఁబడుచున్న మనబలము పరబలమును జయించుటకు చాలకున్నది. భీమునిచే కాపాడఁబడుచున్న యీ పాండవులబలము మనబలమును జయించుటకు చాలియున్నది.

శ్లో॥ అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః।
భీష్మ మే వాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవ హి॥ 11

టీ. భవన్తః=మీరు, సర్వేఏవ=అందఱును, సర్వేషు=సమస్తములయిన, అయనేషు= (వ్యూహ) మార్గములయందు, యథాభా

యు తనబలము వారిని గెలుచుటకు చాలకుండుటయు నాచార్యుని

* ఇట దుర్యోధనుని సైన్యమును 'భీష్మాభిరక్షితమ్' అన్నందులకు ప్రతిగ పాండవసైన్యమును 'భీమాభిరక్షితమ్' అని నిర్దేశించినందుల కభిప్రాయ మేమి? యని శంక గలుగుచున్నది. కురుసేనకు భీష్ముఁడు సేనాధిపతియైనట్లు పాండవసేనకు భీముఁడు సేనాధిపతిగాఁడు. ధృష్టద్యుమ్నుఁడే యట్లగును. భీష్ముఁడు 'శక్తోహం ధనుషైకేన నిహన్తుం సర్వపాణ్డవాన్। యద్యేషాం నభవేద్గోప్తా విష్ణుః కారణపూరుషః' 'కారణార్థము మనుష్యుఁడైయున్న విష్ణువు పాండవులకు రక్షకుఁడుగాఁడేని వీరినందఱిని ఒక్కవింటనే గెలువనేర్తును' అని తానే చెప్పికొనియున్నాఁడు గావున ఇట్టి భీష్మునితో సాటియైన పౌరుషము భీమునకుఁ గలుగుట కానరాదు. భీష్మునికి ప్రతిబల మగు పాండవసైన్యమునకు భీముఁడు అధిపతియుఁగాఁడు; అధిపతి ధర్మరాజేయగును. ఆ ప్రతిబలమందలి భటులలో భీముఁడు ప్రధానుఁడునుగాఁడు. అట్టివాఁడర్జునుఁడనియే ప్రసిద్ధి. కనుక భీష్ముని ప్రతిగా భీముని నిర్దేశించుటకు కారణమేమనఁగా, భీష్ముఁడు సమస్త పాండుకుమారులను రక్షించుటయందు ప్రవణుఁడైనవాఁడు. అతనికి వ్యత్యస్తముగా భీముఁడు సమస్త ధార్తరాష్ట్రులను వధించుటకు దీక్షఁబూని యందులకు దగిన సాహసబలసహాయాది సంపత్తిగలిగినవాఁడు. కావుననే భీష్మునకు మాఱుగా భీముఁడు నిర్దేశింపఁబడినాఁడని తెలియుచున్నది.

ఃవంతులచోప్పున-అనగా మీావరున నతిక్రమింపక,అవస్థితాః=
న్న వారై, భీష్మమేవ=భీష్ముని నే, అభిరక్షన్తుహి=అంతటను రక్షిం
రుగాక.

తా. మీారందఱును, అన్ని వ్యూహమార్గములయందు మీా
తులచొప్పున నిలిచియుండి భీష్ముని సంరక్షింపవలయునుగదా.

॥తస్య సంజనయ న్హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శ్శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్॥ 12

టీ. ప్రతాపవాన్-పరాక్రమవంతుఁడును, కురువృద్ధః=కౌరవు
లో పెద్దయునగు, పితామహః=భీష్ముఁడు,తస్య=ఆదుర్యోధనునికి,
ర్షం=సంతోషమును, సంజనయన్ = చక్కఁగా పుట్టించుచు-
ర్షమును బుట్టించుటను జెప్పుటచే దుర్యోధనుఁడు లోపల విష
ై యుండెననుట సూచితము, ఉచ్చైః=గట్టిగా, సింహనాదం=
హనాదమును,వినద్య=ధ్వనింపఁజేసి,శఙ్ఖం=శంఖమును,దధ్మౌ=
రించెను.

తా. (ఇట్లు దుర్యోధనుఁడు స్వబలపరబలముల తారతమ్య
ను జూచి మనస్సునందు దుఃఖముపొందియుండఁగా) పరాక్రమ
తుఁడును కౌరవులలో పెద్దయునగు భీష్ముఁడు ఆవిషాదము నె
గి యాతనికి సంతోషము కలుగునట్లు మిక్కుటముగా సింహ
దము చేసి శంఖము పూరించెను.

శ్లో॥ తత శ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।

---

దెలిపి లోపల విషణ్ణుఁడయ్యెను అతని విషాదమును గనుఁగొని
ష్ముఁడతనికి హర్షముఁ బుట్టించుటకు సింహనాదము సేసి శంఖ
ను పూరించి శంఖభేరీధ్వనులచే గెలుపుసూచించునట్టి ఘోష
ను జేయించెను. అంత నాఘోషమును విని సర్వేశ్వరే

సహసై వాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్ ॥ 13

టీ. తతః=పిమ్మట, శఙ్ఖాశ్చ = శంఖములును, భేర్యశ్చ=దుందుభులును,పణవ ఆనక గోముఖాః=ఉడుకలు తమ్మటలు బూరలును, సహసా ఏవ=ఒకసారిగానే, అభ్యహన్యన్త=కొట్టఁబడినవి,స శబ్దః= ఆధ్వని, తుములః=సంకీర్ణముగా, అభవత్ = ఆయెను.-అనఁగా విజిగీషాసూచకముగా సేనాధిపతి యగుభీష్ముఁడు శంఖాదిధ్వనులు చేయించినాఁడని తెలియునది.

తా. అనంతరము శంఖములు భేరులు ఉడుకలు తమ్మటలు బూరలును ఒకసారిగ మ్రోఁగింపఁబడెను. ఆధ్వనులు కలసి యంతటను వ్యాపించెను.

శ్లో॥ తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ ।
మాధవః పాణ్డవ శ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః॥ 14

టీ. తతః=అటుపిమ్మట, శ్వేతైః=తెల్లనివియగు,హయైః=గుఱ్ఱములతో, యుక్తే=కూడుకొనినదియు, మహతి=గొప్పదియునగు స్యన్దనే=రథమునందు, స్థితౌ=ఉన్న, మాధవః= శ్రీకృష్ణమూర్తియు పాణ్డవశ్చైవ=అర్జునుఁడును, దివ్యౌ= శ్రేష్ఠములగు, శఙ్ఖౌ=శఙ్ఖములను, ప్రదధ్మతుః= లెస్సగా పూరించిరి.

తా. అటుపిమ్మట తెల్లనిగుఱ్ఱములు పూన్చిన మహారథమునం దున్న కృష్ణార్జునులు తమదివ్యశంఖముల నొత్తిరి.

శ్లో॥ పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః ।

---

శ్వరుఁడగు పార్థసారథియు రథి యగుపాండుకుమారుఁ డర్జునుఁ ను, త్రైలోక్యమును జయించుటకు సాధనభూతములగుమహారములం దున్నవారై ముల్లోకములను గంపింపఁజేయుచున్నవియ శ్రీమంతములు నగుపాంచజన్య దేవదత్తముల నెడిదివ్యశంఖములఁ

పౌండ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః॥ 15

టీ. హృషీకేశః=శ్రీకృష్ణుఁడు, పాఞ్చజన్యం=పాంచజన్యము ను, దధ్మౌ=పూరించెను, ధనఞ్జయః=అర్జునుఁడు, దేవదత్తం=దేవదత్తమును, దధ్మౌ=పూరించెను, భీమకర్మా=భయంకర వ్యాపారములు,*వృకోదరః=భీముఁడు, పౌండ్రం=పౌండ్రమనెడి, మహాశఙ్ఖం=గొప్పశంఖమును, దధ్మౌ=పూరించెను.

తా. శ్రీకృష్ణుఁడు పాంచజన్యమును అర్జునుఁడు దేవదత్తమును పూరించినవెంటనే భయంకరకృత్యములఁ జేయు భీముఁడు పౌండ్రమను మహాశంఖమును పూరించెను.

శ్లో॥ అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః।

నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥ 16

టీ. రాజా=రాజును, కున్తీపుత్త్రః=కుంతీపుత్త్రుఁడునగు, యుధిష్ఠిరః=ధర్మరాజు, అనన్తవిజయం=అనంతవిజయమను శంఖమును, దధ్మౌ=పూరించెను), నకులః=నకులుఁడు, సహదేవశ్చ=సహదేవుఁడును, సుఘోషమణిపుష్పకౌ=సుఘోషము మణిపుష్పకము నను శంఖములను, (దధ్మతుః=పూరించిరి).

తా. కుంతీపుత్త్రుఁడగుధర్మరాజు అనంతవిజయమను శంఖమును, నకులుఁడు సుఘోషమను శంఖమును, సహదేవుఁడు మణిపుష్పకమను శంఖమును బూరించిరి.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాసశ్శిఖణ్డీచ మహారథః।

ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః॥ 17

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।

బూరించిరి. అంత యుధిష్ఠిరుఁడును భీముఁడు మొదలగువారును తమ

*వృకఉదరః=వృకమనెడి యగ్ని కడుపులోఁగలవాఁడు.

సౌభద్రశ్చ మహాబాహుః శఙ్ఖాన్దధ్ముః పృథక్ పృథక్॥

టీ. పృథివీపతే=ధృతరాష్ట్రమహారాజా, పరమేష్వాసః=గొప్ప విల్లుగల, కాశ్యశ్చ=కాశీరాజును, మహారథః=మహారథుఁడైన, శిఖణ్డీచ=శిఖండియును, ధృష్టద్యుమ్నశ్చ=ధృష్టద్యుమ్నుఁడును, విరాటశ్చ=విరాటుఁడును, అపరాజితః=అపజయముఁబొందని, సాత్యకిశ్చ=సాత్యకియును, ద్రుపదః=ద్రుపదరాజును, ద్రౌపదేయాశ్చ=ద్రౌపదీకుమారులైన యుపపాండవులును, మహాబాహుః=గొప్ప భుజములుగల, సౌభద్రశ్చ=అభిమన్యుఁడును, సర్వశః=సేనయంగంతట, పృథక్ పృథక్=వేఱువేఱుగా, శఙ్ఖాన్=శంఖములను, దధ్ముః=పూరించిరి.

తా. ధృతరాష్ట్రమహారాజా, మేటివిలుకాఁడగు కాశీరాజును, మహారథుఁడగు శిఖండియు, ధృష్టద్యుమ్నుఁడును, విరాటరాజును, యుద్ధమునం దపజయము నొందని సాత్యకియు, ద్రుపదరాజును, ఉపపాండవులును, భుజబలము గలయభిమన్యుఁడును, సేనయంతంతటఁ గలతక్కిన యోధాగ్రేసరులందఱును వేఱువేఱుగా తమతమ శంఖములను పూరించిరి.

పాండవసేనానాయకులు వేఱువేఱుగా శంఖములను బూరించిరనుటచే తమశంఖధ్వను లొక్కటొకటియును దుర్యోధనాదులకు హృదయభేదనము గావించునట్లు పూరించిరని భావము.

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీం చైవ తుములోఽభ్యనునాదయన్॥ 19

టీ. తుములః=సంకులమైన, స ఘోషః=ఆశబ్దము, నభశ్చ=ఆ

---

తమశంఖములను వేఱువేఱ పూరించిరి. ఆ ఘోషము దుర్యోధనాదులయిన నీకుమారులందఱి హృదయములను భేదింపగా 'ఇం

ాశమును, పృథివీంచ = భూమినిని, అనునాదయన్ అపి = ప్రతిధ్వనుల నిచ్చునట్లుచేయుచున్నను - ముల్లోకములను కంపింపఁజేయుచున్నను, ధార్తరాష్ట్రాణాంఏవ=నీపుత్రులగు దుర్యోధనాదులయొక్కయె, హృదయాని=గుండెలను, వ్యదారయత్ = బ్రద్దలుచేసెను- ధృతరాష్ట్రునికుమారులలో ఒక్కనికిఁగూడ దృఢచిత్తము లేకపోయె ననిభావము. తమబలముగెలుచునని నమ్మియుండువారికి అది నశించునని బుద్ధిపుట్టుటే వారి హృదయవిదారణమని తెలియునది.

తా. భయంకరమైన ఆశంఖనాదము భూమ్యంతరిక్షములయందంతట ప్రతిధ్వను లెసఁగఁజేయుచున్నను, నీపుత్రులగు దుర్యోధనాదులకుమాత్రము గుండెలు పగిల్చినదయ్యెను. (ఇతరులకు సంతోషహేతువయ్యెనని భావము.దుర్యోధనునిగెలుపున కువ్విళ్లూరుచున్న ధృతరాష్ట్రునకు సంజయుఁడు దుర్యోధనుని యపజయమే యనుట సూచించినాఁడని తెలియునది.)

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః॥ 20
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే।

టీ. మహీపతే = రాజా, అథ=శంఖారావముచేసిన పిమ్మట, శస్త్రసంపాతే=ఆయుధప్రయోగము, ప్రవృత్తే(సతి)=ప్రవర్తించిన దగుచుండఁగా,కపిధ్వజః=హనుమంతుఁడు ధ్వజమునందుగల, పాండవః=అర్జునుఁడు, వ్యవస్థితాన్=యుద్ధముచేయ నిలిచియున్న, ధా

---

కు నశించినట్టే కురుబలము' అని ధార్తరాష్ట్రులు తలఁచిరి'' ఈప్రకారముగా, దుర్యోధనుని విజయమును గోరుచున్న ధృతరాష్ట్రునకు సంజయుఁడు చెప్పెను.అంత యుద్ధముసేయఁగోరి నిలిచియున్న

ర్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను, దృష్ట్వా=చూచి,ధనుః=వింటిని, ఉద్యమ్య=ఎత్తి, తదా=అప్పుడు, హృషీకేశం= (హృషీకమనగా ఇంద్రియములు, ఈశుఁడనఁగా నియమించువాఁడు, పరావరము లగు సమస్తజనుల బాహ్యాంతరకరణములను సర్వప్రకారముల నియమించువాఁడగు) శ్రీకృష్ణునిఁగూర్చి, ఇదంవాక్యం=ఈమాట ను, ఆహ=పలికెను.

తా. ఓరాజా, అంత కపిధ్వజుఁడైనయర్జునుఁడు యుద్ధసన్న ద్ధుడై నిలిచియున్న దుర్యోధనాదులఁగనుంగొని,బాణప్రయోగ సమయం బగుటయు, గాండీవంబు నెత్తి శ్రీకృష్ణుని నవలోకించి యిట్లనియె.

శ్లో॥ సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్।
కై ర్మయాసహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥ 22

టీ. హేఅచ్యుత*=ఓకృష్ణా,అస్మిన్=ఈ, రణసముద్యమే=యు ద్ధోద్యోగమునందు, మయా=నాచేత, కైస్సహ=ఎవరితో,యోద్ధ వ్యం=యుద్ధముచేయఁదగినదో, యోద్ధుకామాన్ = యుద్ధముసే

ధార్తరాష్ట్రులను జూచి,లంకాదహనము చేసినబలువానరుని ధ్వజ మునంగలపాండుకుమారుఁ డర్జునుఁడు,జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్య తేజస్సులకు నిధియు,నిజసంకల్పమున జగదుదయస్థితిలయములను లీలలుగాఁ గావించువాఁడును, హృషీకేశుఁడుగావున పరావరము లగు సకలజనముల బాహ్యాంతరకరణముల సర్వప్రకారముల ని యమించుచుండువాఁడును, ఆశ్రితవాత్సల్యమున వివశుఁడై తన

* అచ్యుతః=స్వరూపస్వభావాదుః లగు జ్ఞానశక్త్యాదులనుండి చ్యుతుఁ డుకాని (జాఱని)వాఁడు.జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్య తేజస్సులకు నిధియైనవాఁడు

మున్ గోరికగలవారై, అవస్థితాన్=నిలిచియున్న, ఏతాన్=వీరిని, యావత్=ఎంతలో, అహం=నేను, నిరీక్షే=చూతునో,(తావత్=అంతవఱకు), ఉభయోః=రెండైన, సేనయోః=సేనలయొక్క, మధ్యే=నడుమ- రెండుసైన్యములను లెస్సగా కనుఁగొనుటకుఁ దగినట్టిస్థానమున, మే=నాయొక్క, రథం=రథమును, స్థాపయ=నిలుపుము.

తా. ఓకృష్ణా, ఈయుద్ధోద్యోగమునందు నేనెవరితో యుద్ధము సేయఁదగినదో, యుద్ధము సేయఁ గోరివచ్చినవార లెవరెవరో, వారిని చక్కఁగా నవలోకించునవఱకు (లేక, వారిని చూడఁదగినస్థానమునందు) ఈ రెండుసేనలనడుమ మనరథము నిలుపుము.

శ్లో॥ యోత్స్యమానా నవేక్షేఽహం యఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః॥ 23

టీ. దుర్బుద్ధేః=చెడ్డబుద్ధిగల, ధార్తరాష్ట్రస్య=దుర్యోధనునికి, ప్రియచికీర్షవః=ఇష్టము చేయఁగోరినవారై, యుద్ధే=యుద్ధమునందు, యేఏతే=ఏవీరు, అత్ర=ఇచ్చట, సమాగతాః=వచ్చిచేరియున్నారో, యోత్స్యమానాన్=యుద్ధముచేయఁగలవారిని, అహం=నేను, అవేక్షే=చూచెదను.

తా. దుర్బుద్ధియగు దుర్యోధనునకుఁ ప్రియముఁ గావింపఁ గోరి యిచ్చట యుద్ధముచేయుటకు కూడినవా రెవ్వరెవ్వరో వారిని నేను చూచెదను.

సఞ్జయ ఉవాచ=సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

---

కు సారథ్యముసేయుచున్నవాఁడును అగుభగవంతునిఁజూచి, తాను యుద్ధముసేయఁగోరి నిలిచియున్నవారిని కలరూపున కనుఁగొనువాఁడై వారిని జూచుటకుఁ దగినట్టిస్థానమున రథమును నిలుపుమని

శ్లో॥ ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥24
భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి॥ 25

టీ. హే భారత=ఓధృతరాష్ట్రుఁడా, *గుడాకేశేన=అర్జునునిచేత, ఏవం=ఈప్రకారము, ఉక్తః=చెప్పఁబడిన, హృషీకేశః=శ్రీకృష్ణుఁడు, ఉభయోః సేనయోః=రెండుసేనలయొక్క, మధ్యే=నడుమ, భీష్మద్రోణ ప్రముఖతః=భీష్మద్రోణులు మొదలగు, సర్వేషాం=సమస్తమైన, మహీక్షితాంచ (పశ్యతాం)=రాజులందఱు నే చూచుచుండఁగా, రథోత్తమం=రథశ్రేష్ఠమును, స్థాపయిత్వా=నిలిపి హేపార్థ=అర్జునా, సమవేతాన్=చేరియున్న, ఏతాన్=ఈ,కురూన్=కౌరవులను, పశ్య=చూడుము - వీరలగెలుపు స్థితినిం జూడుము ఇతి=అని ఉవాచ= పలికెను.

తా. ఓరాజా, ఇట్లు అర్జునప్రేరితుఁడైన శ్రీకృష్ణుఁ డుభయ సేనామధ్యమున భీష్మద్రోణ ప్రముఖుల కభిముఖంబుగా రథంబు నిలిపి, అర్జునా, యుద్ధముచేయు నభిలాషతోఁ గూడియున్న ఈ కౌరవసైనికుల నవలోకింపు మని పలికెను.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్ ।
ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీం స్తథా

---

పురికొలిపెను. అట్లుపురికొలుపఁబడియాభగవంతుఁడుభీష్మద్రోణాదులును తక్కినరాజులును ఎల్లవారును జూచుచునేయుండఁగా నరనుఁడు చెప్పినట్లుచేసెను. నీవారలు (ధార్తరాష్ట్రులు) గెలుచుస్థి

---

* గుడాకేశః (గుడాకా=నిద్రను, ఈశః=అధిపతి)=నిద్రను జయించి

శ్వశురాన్సుహృదశ్చైవ సేనయో రుభయో రపి।

టీ. అథ=పిదప, పార్థః=అర్జునుఁడు, తత్ర=అచ్చట, ఉభయోః సేనయోః=రెండు సేనలయందును, స్థితాన్=ఉన్న, పితౄన్=తండ్రివరుసవారయిన భూరిశ్రవః ప్రభృతులను, పితామహాన్=తాతవరుసవారయిన భీష్మాదులను, ఆచార్యాన్=గురువులయిన ద్రోణాదులను, మాతులాన్=మేనమామలయిన శల్యాదులను, భ్రాతౄన్=అన్నదమ్ములయిన దుర్యోధనాదులను, పుత్రాన్=కుమారులయిన లక్ష్మణాదులను, పౌత్రాన్=మనుమలయిన లక్ష్మణపుత్రాదులను, తథా=అట్లు, సఖీన్=స్నేహితులగుకృతవర్మాదులను, శ్వశురాన్=(ద్రుపదరాజువలె) మామలను, సుహృదశ్చ=హితముగోరువారినిని, అపశ్యత్=చూచెను.

తా. పిమ్మట అర్జునుఁడు ఆ రెండుసేనలయందున్న తండ్రి తాతవరుసలవారిని, ఆచార్యులను, మేనమామలను, అన్నదమ్ములను కొడుకు మనుమఁడు మొదలైన వరుసగలవారిని, మిత్రులను,మామగార్లను తనహితముగోరువారిని అందఱను జూచెను.

శ్లో॥ తాన్సమీక్ష్య స కౌన్తేయ స్సర్వాన్ బన్ధూ నవస్థితాన్॥
కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్ ।

టీ. సః=ఆ, కౌన్తేయః=అర్జునుఁడు, అవస్థితాన్=యుద్ధరంగమునందున్న, తాన్=ఆ, సర్వాన్=సమస్తమయిన, బన్ధూన్=చుట్టములను, సమీక్ష్య=చూచి, పరయా=అధికమయిన, కృపయా=కనికరముచేత, ఆవిష్టః=పరవశుఁడై, విషీదన్=దుఃఖించుచు, ఇదం=ఈవాక్యమును, అబ్రవీత్=పలికెను.

---

యుట్టిదనియు వారలనెత్తిపొడుచునట్లు చెప్పెను. ఆపార్థుఁడన్ననో గొప్పమనస్సుగలపరమకారుణికుఁడును దీర్ఘబంధువును పరమధా

తా. ఇట్లు యుద్ధరంగమునందు వచ్చియున్న బంధువుల నెల్లరను జూచి, అర్జునుఁడు అత్యంతదయాపరవశుఁడై దుఃఖించుచు నిట్లు పలికెను.

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్॥ 28
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥ 29
గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ 30

టీ. హే*కృష్ణ=ఓకృష్ణుఁడా, యుయుత్సుం = యుద్ధముసేయ నిచ్ఛగలయట్టియు, సముపస్థితం=వచ్చియున్నట్టియు, ఇమంస్వజనం =ఈబంధుజనమును, దృష్ట్వా=చూచి, మమ=నాయొక్క, గాత్రాణి=అవయవములు, సీదన్తి=శిథిలములగుచున్నవి, ముఖంచ=ముఖమును, పరిశుష్యతి=ఎండిపోవుచున్నది, మే=నాయొక్క, శరీరే=దేహమునందు, వేపథుశ్చ=వడఁకును, (జాయతే=పుట్టుచున్నది) రోమహర్షశ్చ=పులకరింతయు, జాయతే=పుట్టుచున్నది, హస్తాత్=చేతినుండి, గాండీవం=గాండీవము, స్రంసతే = జాఱుచున్నది, త్వక్చైవ=చర్మమును, పరిదహ్యతే=అంతటను దహింపఁబడుచున్నది, మే=నాయొక్క, మనశ్చ=మనస్సును, భ్రమతీవ=తిరుగుచున్నట్లున్నది, అవస్థాతుంచ=రథమున నిలుచుటకును, న శక్నోమి=శక్తిలేకయున్నాను.

తా. కృష్ణా, యుద్ధేచ్ఛతోవచ్చియున్న స్వజనులగు వీరం

---

రిక్షకుఁడును నగుంగావున తానును తనతోఁబుట్టువులును మీచే నతిఘోరములైన జతుగృహదాహాది మారణకర్మములచే మా

౼చి నాకరచరణాద్యవయవములు తడఁబడుచున్నయవి. నోరు ౦డిపోవుచున్నది. నాశరీరంబున వడఁకును పులకరింతయుఁ బొ ముచున్నయవి. గాండీవము చేతినుండి జాఱుచున్నది. దేహము ౦డుచున్నది. నామనస్సు తల్లడిల్లుచున్నది. ఇఁక రథంబున లిచియుండ శక్తుఁడను గాను.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।
న చ శ్రేయోనుపశ్యామి హత్వా స్వజన మాహవే ॥31

టీ. హే* కేశవ=ఓ కృష్ణా, విపరీతాని=అనిష్టసూచకములగు, ిమిత్తాని=శకునములను, పశ్యామి=చూచుచున్నాను. ఆహవే= యుద్ధమునందు, స్వజనం=బంధుజనమును, హత్వా=చంపి,అను= ంటుపిమ్మట, శ్రేయశ్చ=మేలును, న పశ్యామి=చూడకున్నాను.

తా. కృష్ణా, అనిష్టసూచకము లగుశకునములు గానంబడు న్నవి. యుద్ధమునందు బంధుజనమును బరిమార్చుటవలన నగు శ్రేయ మెద్దియో కానరాదు.

శ్లో॥ నకాఙ్క్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖానిచ ।
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా॥ 32

టీ. హేకృష్ణ=ఓకృష్ణా, విజయం=జయమును, రాజ్యంచ= రాజ్యమును, సుఖానిచ=సుఖములను, న కాఙ్క్షే=కోరను, హే గో విన్ద †=ఓగోవిందా, నః=మాకు, రాజ్యేన=రాజ్యముచేత,కిం=ఏమి

మాటికి వంచింపఁబడియున్నవారయ్యును పరమపురుషునిసాహా య్యమునఁ దనచే చావనున్నవీవారలను విలోకించి బంధుస్నేహ మునను మిక్కుటమైనకృపవలనను ధర్మాధర్మభయమునను అవ

* క ఈశ వ=బ్రహ్మను రుద్రుని రక్షించువాఁడు.

†గోవిన్ద=ఇంద్రియములు అధిష్ఠానముగాఁగలవాఁడు; లేక, వేదముచేతఁ

ప్రయోజనము, భోగైః=భోగములచేతఁగాని, జీవితేనవా=బ్రదికి యుండుటచేతఁగాని, కిం=ఏమిప్రయోజనము.

తా. కృష్ణా, నాకు జయమువలదు. రాజ్యమువలదు. సుఖము ను అభిలషించువాఁడనుగాను. రాజ్యమువలన మాకేమి ప్రయోజనము. మఱి భోగమువలనఁగాని బ్రదికియుండుటవలనఁ గాని మనకు వచ్చునదియేమి.

శ్లో॥ యేషా మర్థే కాఙ్క్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ।
త ఇమే ఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥33

టీ. నః=మనయొక్క, రాజ్యం=రాజ్యము, యేషామర్థే=ఎవరినిమిత్తము, కాఙ్క్షితం=కోరఁబడినదో, భోగాః=సుఖసాధనములును, సుఖానిచ=సుఖములును, (కాఙ్క్షితాని=కోరఁబడినవో) తే ఇమే=అటువంటివీరు, ప్రాణాన్=ప్రాణముల(మీఁది ఆశ)ను ధనాన్=ధనముల(మీఁది ఆశ)ను, త్యక్త్వా=విడిచి, యుద్ధే=యుద్ధమునందు, అవస్థితాః=వచ్చి నిలిచి యున్నారు.

తా. ఎవ్వరినిమిత్తము రాజ్యమును భోగమును సుఖమును గోరుదుమో అట్టిబంధుజనము ప్రాణములమీఁదను ధనముమీఁదను ఆశవదలి యుద్ధరంగమునందు వచ్చియున్నారు.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రాః స్యాలాస్సమ్బన్ధిన స్తథా

టీ. ఆచార్యాః=గురువులును, పితరః=తండ్రులును, పుత్రాః=కొడుకులును, తథైవ=అట్లే, పితామహాః=తాతలును, మాతలాః=మేనమామలును, శ్వశురాః=మామలును, పౌత్రాః=మన

---

తెలియఁబడువాఁడు; లేక, గో అవిమ్ ద=వాక్కులయొక్క అజ్ఞానమును

ఁలును, స్యాలాః=భార్యతోఁబుట్టినవారును - బావమఱఁదులు
ు, తథా=ఆప్రకారము, సమ్బన్ధినః=చుట్టములును.

తా. వా రెవ్వరనఁగా-ఆచార్యులు, తండ్రులు, కుమారులు,
ౌతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావలు, మఱఁ
ఁదులు, సంబంధులు నగు బంధువులు.

శ్లో॥ ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే॥ 35

టీ. మధుసూదన=కృష్ణా, ఘ్నతోఽపి=కొట్టుచున్నవారైనను,
ఏతాన్=వీరిని, త్రైలోక్యరాజ్యస్య హేతోరపి=మూఁడులోకము
ల రాజ్యాధిపత్యము నిమిత్తమైనను, హన్తుం=చంపుటకు, న ఇ
చ్ఛామి=ఇచ్ఛగింపకున్నాను, మహీకృతే = భూమిప్రాప్తికొఱకు,
కిం ను= చెప్పవలసిన దేమి.

తా. కృష్ణా, వీరు నన్నుఁ జంపినను జంపనీ. త్రైలోక్యరాజ్య
ము ప్రాప్తమయినను వీరిని జంపుటకు నాకు మనసు రాకున్నది.
ఇట్లుండ మహీరాజ్యలాభమునకై వీరినిఁ జంప నెంతునా.

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యాజ్జనార్దన।
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః॥

టీ. *జనార్దన=కృష్ణా, ధార్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను,
నిహత్య=చంపి, నః=మనకు, కా ప్రీతిః=ఏమిసంతోషము, స్యాత్
=కలుగును. †ఆతతాయినః=మహాపాతకులయినను - లక్కయిల్లు

* జన అర్దన=జనులనుచంపువాఁడు- అనఁగా సంహారకర్త; లేక, దుర్జను
లను హింసించువాఁడు; లేక, పుట్టుకను బోఁగొట్టువాఁడు.

† అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః। క్షేత్రదారహరశ్చైవ
షడేతే హ్యాతతాయినః ॥ ఇండ్లు మొదలగువానికి నిప్పు పెట్టువాఁడు, విషము పెట్టు

గాల్చుట మొదలైన ఘోరమారణ కర్మములచే మాటికి వం చించినవారైనను, ఏతాన్=వీరిని, హత్వా=చంపి, (స్థితాన్=ఉ న్న), అస్మాన్=మనలను, పాపమేవ=పాపమే, ఆశ్రయేత్=పొందు ను. "ఆతతాయిన మాయాన్తం హన్యా దే వావిచారయన్" (చంపనుద్యుక్తుఁడై వచ్చువానిని విచారింపక చంపవలసినదియె) అను నీతిశాస్త్రవచనముకంటె, "అహింసాపరమోధర్మః"(హిం సింపకుండుట అన్నిధర్మములకంటె గొప్పధర్మము) అను ధర్మ శాస్త్రవచనము బలవంతమని భావము.

తా. జనార్దనా, దుర్యోధనాదులను జంపుటవలన మనకేమి సంతోషము కాఁగలదు. వీరు మహాపాతకులయినను వీరలం జంపి మనము గట్టుకొనునది పాపమొక్కటియే.

శ్లో॥ తస్మాన్నార్హావయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాన్ధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ॥37

టీ. మాధవ=కృష్ణా, తస్మాత్=దానివలన, వయం=మనము సబాన్ధవాన్=బంధువులతోఁగూడిన, ధార్తరాష్ట్రాన్ = దుర్యో ధనాదులను, హన్తుం=చంపుటకు, నార్హాః=తగినవారముకాము స్వజనం=స్వజనమును, హత్వా=చంపి, కథం హి=ఎట్లుదా, సుఖి నః = సౌఖ్యవంతులము, స్యామ=అగుదుము.

తా. అట్లగుటంజేసి బంధుజనములతోఁగూడ దుర్యోధనాద లను సంహరించుట మనకు యుక్తముకాదు. మాధవా, స్వజన మును సంహరించి మనమెట్లు సుఖముఁ జెందఁగలము.

శ్లో॥ యద్య ప్యేతే న పశ్య న్తి లోభోపహతచేతసః।

---

వాఁడు, శస్త్రిముచేతఁగలవాఁడు,ధనము నపహరించువాఁడు, భూమినిభార్యఁ

కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥ 38
కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివ ర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన॥ 39

టీ. లోభోపహత చేతసః=రాజ్యమునందు పేరాసచేతఁ జెడఁగొట్టఁబడినమనస్సుగల, ఏతే=ఈదుర్యోధనాదులు, కులక్షయకృతం=వంశనాశమువలనఁగలుగు, దోషం=దోషమును, మిత్రద్రోహే=మిత్రద్రోహమునందలి, పాతకంచ=పాపమునును, నపశ్యన్తి యద్యపి=ఆలోచింపకపోయినను, హేజనార్దన=ఓకృష్ణా, కులక్షయకృతం = కులనాశమువలనఁగలిగింపఁబడు,దోషం = పాపమును, ప్రపశ్యద్భిః=చక్కఁగా తెలిసికొనుచున్న, అస్మాభిః=మనచేత, అస్మాత్ పాపాత్ = ఈపాపమునుండి, నివర్తితుం= మరలుటకు-తొలఁగుటకు, కథం=ఎట్లు, నజ్ఞేయం= తెలియఁదగదు.

తా. రాజ్యమునందలి పేరాసచేత మనస్సుచెడినవారు గాన ఈదుర్యోధనాదులు స్వకులక్షయముచే కలుగుదోషమును మిత్రద్రోహముచే నగుపాతకమును నెంచువారు గాకున్నను,జనార్దనా, కులక్షయమువలన కలుగుదోషమును పరికించునట్టి మన మీపాపము పరిహరింప నుపాయముఁ గానక పోవు టెట్లు?

శ్లో॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మా స్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత ॥ 40

టీ. కులక్షయే (సతి)=వంశనాశము కలుగుచుండఁగా, సనాతనాః=పరంపరగావచ్చిన, కులధర్మాః=కులధర్మములు, ప్రణశ్యన్తి=నాశమునుబొందును, ధర్మేనష్టే (సతి)=ధర్మము నశించినదగుచుండఁగా, కులంకృత్స్నముత=కులమునంతటిని,అధర్మః=అధర్మము, అభిభవతి=క్రిందుపఱుచుచున్నది- చెఱుపుచున్నది.

తా. కులనాశముసంభవించినపుడు చిరకాలమునుండి పరంపరగా నాచరింపఁబడు చున్నకులధర్మములు నాశమునొందును. అట్టియాచారములు నశించినయెడల కులంబంతయు నధర్మమునఁ బ్రవర్తిల్లును.

శ్లో॥ అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసఙ్కరః॥ 41

టీ. హేకృష్ణ=ఓకృష్ణా,అధర్మాభిభవాత్ =అధర్మము మించుటవలన, కులస్త్రియః=కులస్త్రీలు, ప్రదుష్యన్తి=చెడుదురు. వార్ష్ణేయ=కృష్ణా,స్త్రీషు దుష్టాసు సతీషు = స్త్రీలుచెడినవారలగుచుండఁగా, వర్ణసఙ్కరః= వర్ణము లొకటితోనొకటి కలసిపోవుట, జాయతే=కలుగుచున్నది.

తా. కృష్ణా, అట్టియధర్మము మించుటచేత కుల స్త్రీలు చెడుదురు. స్త్రీలుచెడిన వర్ణసంకరం బగును.

శ్లో॥ సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః॥ 42

టీ. సఙ్కరః=వర్ణసంకరము, కులఘ్నానాం=కులమును చెడగొట్టినవారికిని, కులస్య=కులమునకును, నరకాయైవ=నరకముకొఱకే, (భవతి=అగుచున్నది), హి = ఏలనఁగా, ఏషాం = వీరియొక్క, పితరః=పితృదేవతలు, లుప్తపిణ్డోదకక్రియాః (సన్తః) లోపించిన పిండోదకకార్యములు గలవారగుచు, పతన్తి=నరకమునఁ బడుదురు.

తా. వర్ణసంకరమువలన కులనాశకులకును కులమువారికి నరకము కలుగును. ఇంతేకాక వారిపితృదేవతలు తమ్ము ని

ంచి పిండోదక క్రియలు చేయువారు లేకుండుటచేత నధోగతిఁ
ందుదురు. (నరకమునఁ బడుదురనుట).

శ్లో॥ దోషై రేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43

టీ. కులఘ్నానాం=కులనాశకులయొక్క, వర్ణసఙ్కరకారకైః=
ర్ణసంకరముఁ జేయు, ఏతైః దోషైః=ఈదోషములచేత, శాశ్వ
తాః=పరంపరాప్రాప్తములయిన, జాతిధర్మాశ్చ=వర్ణాచారములు
ను, కులధర్మాశ్చ=కులాచారములును, ఉత్సాద్యన్తే=చెడఁగొట్టఁ
బడుచున్నవి.

తా. ఇట్లు కులము చెఱిచినవారల దోషములచేత వర్ణసంకర
ము,పురాతనములగుకులధర్మములును వర్ణాచారములును జెడును.

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ॥ 44

టీ. హేజనార్దన = ఓకృష్ణా, ఉత్సన్నకులధర్మాణాం=నశించిన
కులధర్మములుగల, మనుష్యాణాం=మనుష్యులకు, నరకే=నరక
మునందు, నియతం=ఎల్లపుడును, వాసః=ఉనికి, భవతి=అగుచు
న్నది, ఇతి=అని, అనుశుశ్రుమ=వింటిమి.

తా. కృష్ణా, కులధర్మములు చెడిన మానవులకు ఎల్లప్పుడును
నరకవాసమగునని వినియున్నాము.

శ్లో॥ అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
య ద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః॥ 45

టీ. అహో = ఆశ్చర్యము, బత=అయ్యో, యత్ =ఏకారణ
మువలన, వయం=మనము, రాజ్యసుఖలోభేన=రాజ్యమందును
సుఖమందును పేరాసచేత, స్వజనం=బంధుజనమును, హన్తుం=

చంపుటకు, ఉద్యతాః = యత్నించితిమో, (తత్ = ఆకారణము వలన), మహత్ = అధికమైన, పాపం = పాపమును, కర్తుం = చేయుటకు, వ్యవసితాః = ఉద్యుక్తులమైతిమి.

తా. కటకటా, మనము మహత్తరమైనపాపము గట్టికొనుటకుం బాలుపడితిమి. రాజ్యసుఖములందలి పేరాసచేత మనబంధుజనమును జంప యత్నించితిమి కదా.

శ్లో॥ యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ॥

టీ. శస్త్రపాణయః = ఆయుధములుచేతులలోఁగల, ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు, అశస్త్రం = శస్త్రములులేనివాఁడును, అప్రతీకారం = ప్రతిక్రియలేనివాఁడును నగు, మాం = నన్ను, రణే = యుద్ధమునందు, హన్యుర్యది = సంహరించిరేని, తత్ = ఆమరణము మే = నాకు, క్షేమతరం = మఱింత క్షేమము, భవేత్ = అగును.

తా. శస్త్రాస్త్రములు పరిత్యజించి ప్రతియుద్ధముచేయనినన్నుఁ శస్త్రపాణు లయినదుర్యోధనాదులు యుద్ధమునందు వధించిరేః అదియును నాకు మఱింత క్షేమమే యగును.

సఞ్జయ ఉవాచ = సంజయుఁడుపలికెను.

శ్లో॥ ఏవ ముక్త్వాఽర్జున స్సఙ్ఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ 4

టీ. సఙ్ఖ్యే = యుద్ధరంగమునందు, అర్జునః = అర్జునుఁడు, ఏవం

యవములన్నియు మిక్కిలియు విరవిరఁబోవ 'సర్వవిధముల నేన యుద్ధముసేయను' అనిచెప్పి బంధువిశ్లేషమువలనఁ గలుగుశోకమచే మనస్సు కొందలపడఁగా అమ్మును వింటిని విడిచి రథోపస్థమున గూర్చున్న, వాఁడయ్యెను.

ట్లు, ఉక్త్వా=పలికి, శోకసంవిగ్నమానసః=దుఃఖముచేతమిక్కిలి కలించినమనస్సుగలవాఁడగుచు, సశరం=బాణముతోఁగూడిన, చాపం=ధనుస్సును, విసృజ్య=విడిచి, రథోపస్థే=రథముమీఁద, ఉపావిశత్=కూర్చుండెను.

తా. అర్జునుఁడీవిధమునఁ బలికి శోకముచేత మనస్సు మిక్కిలి కలఁతనొందఁగా, ఎక్కుపెట్టిన గాండీవమును దిగువఁ బడవైచి రణరంగములో రథిస్థానము విడిచి రథముపయిఁ జదికిలఁబడెను.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగోనామ
ప్రథమోఽధ్యాయః.

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును నగు
శ్రీభగవద్గీతలయందు అర్జునవిషాదయోగం బన్నది

ప్రథమాధ్యాయము.



# శ్రీభగవద్గీతా-ద్వితీయోఽధ్యాయః.

## సాఙ్ఖ్యయోగః.

---

### అవతారిక.

ఆత్మ దేహమునకంటె వేఱై నిత్యమై యుండుటయు, శాస్త్ర విహితధర్మము లగుయుద్ధాదికర్మములను ఫలాపేక్షలేక చేయుట యే యట్టియాత్మస్వరూపప్రాప్తికి సాధనమగుటయును దెలియక దేహమే యాత్మయనియు, యుద్ధము పాపమనియు భ్రమిం మోహితుఁడై, యుద్ధము మాన నిశ్చయించినయర్జునుని య మోహమును బోఁగొట్టుటకు ఆత్మనిత్యత్వమును గుఱించిన సాం ఖ్యజ్ఞానమును, అట్టిజ్ఞానముతోఁగూడినదై ఫలాపేక్షారహిత ర్మానుష్ఠానరూపమై యున్నకర్మయోగమును, దాని కుద్దిష్టఫ మైన స్థితప్రజ్ఞత యనుజ్ఞాననిష్ఠయు (జ్ఞానయోగమును), ఆస్థి ప్రజ్ఞతచే సాధ్య మగుయోగము అనెడిఆత్మదర్శనమును, స్థితప్ర జ్ఞతయొక్క స్వరూపమును, దానిని సాధించుటకు ఇంద్రియ య మావశ్యకమగుటయు, ఇంద్రియజయము భగవంతుని స్మర ము చేతనే సాధ్య మగుననుటయు, భగవంతునిస్మరణముతప్ప క్కినయుపాయములచేత దానిని సాధింపఁ జూచువారికిఁ గ గుకీడులును ఈద్వితీయాధ్యాయమున వివరింపఁబడుచున్నవి.

సఞ్జయ ఉవాచ=సంజయుఁడు (ధృతరాష్ట్రునకు) ఇట్లు చెప్పెను.

శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణం

[illegible]

టీ. తథా=అట్లు, కృపయా=కనికరముచేత, ఆవిష్టం=ఆవేశింబడినవాఁడును, అశ్రుపూర్ణాకులేక్షణం=కన్నీరుతో నిండినవై ్యకులము లైననేత్రములుగలవాఁడును, విషీదన్తం=దుఃఖించు న్నవాఁడునగు, తం=ఆ యర్జునునిఁగూర్చి, మధుసూదనః=శ్రీ ష్ణుఁడు. ఇదంవాక్యం=ఈవచనమును, ఉవాచ=పలికెను.

తా. అట్లు దయాసమేతుఁడై కన్నీరు విడుచుచు వ్యాకులతఁ ందినవాఁడును, దుఃఖాక్రాంతుఁడు నైనయర్జునునిఁ జూచి శ్రీ ృష్ణుం డిట్లు పలికెను.

భగవానువాచ=శ్రీకృష్ణుఁడు పలికెను.

॥ కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున॥ 2

టీ. హే అర్జున=ఓ అర్జునా, అనార్యజుష్టం=పామరులచేత నలంబింపఁబడునదియు, అస్వర్గ్యం=స్వర్గమునకు అనర్హమయినదియు, అకీర్తికరం=అపకీర్తిని గలుగఁజేయునదియును అగు, ఇదం శ్మలం=ఈదుఃఖము, విషమే=ఒడుదుడుకు సమయమందు, కుతః ఎందువలన, త్వా=నిన్ను, సముపస్థితం = పొందినది.

తా. అర్జునా, పామరులకు సహజమయినదియు, స్వర్గ(పర ోక) విరోధియు, అపయశస్సునకు కారణము నైన యీ దుః నుకాలమునం దెందులకు నీకు సంభవించినది.

---

ామానుజభాష్యము— ఇట్లర్జునుఁడు కూర్చుండఁగానే భగవం ుఁడు'ఎందుల కీశోకము తగనిపట్ల సంభవించిన'దని యాక్షేపించి గనిమొదలఁ గలిగిన యీశోకము విద్వాంసులు కానివారికిఁ గ ్గునది; పరలోకమునకు విరోధియైనది; అపకీర్తిని దెచ్చునది; క్షుద్రమైనది. మఱి హృదయదౌర్బల్యముచేఁ గలిగినట్టిది.

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప॥

టీ. పార్థ=అర్జునా, క్లైబ్యం=అధైర్యమును, మాస్మగమః=పొ దకుము, త్వయి=నీయందు, ఏతత్=ఇది, నఉపపద్యతే=తగదు హేపరన్తప=శత్రువులను దపింపఁజేయు అర్జునా, క్షుద్రం=తుచ్ఛమైన, హృదయదౌర్బల్యం=మనస్సునందలి యధైర్యమున త్యక్త్వా=విడిచి, ఉత్తిష్ఠ=లెమ్ము.

తా. అర్జునా, భయమునుజెందకుము.ఇది నీకు యుక్తముకా దు. పరంతపా, తుచ్ఛమైన యీ యధైర్యమును వదలి యుద్ధ ము చేయుటకు లెమ్ము.

అర్జున ఉవాచ=అర్జునుఁడు చెప్పెను.

శ్లో॥ కథం భీష్మ మహం సఙ్ఖ్యే ద్రోణం చ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన॥

టీ. అరిసూదన=శత్రుసంహారకుఁడవైన, మధుసూదన = కృ ష్ణా, పూజార్హౌ=పూజింపఁదగిన, భీష్మం=భీష్ముని, ద్రోణంచ=ద్రో ణునిని-ఇటచకారముచే తక్కిన గురుబంధువులను గూడ గ్రహిం చునది, అహం=నేను, సఙ్ఖ్యే=యుద్ధమునందు, ఇషుభిః=బాణవ లచేత-పువ్వులతోఁ బూజింపఁదగినవారిని బాణములతో పీడిం యనుట, కథం=ఎట్లు, ప్రతియోత్స్యామి=ఎదిరించి యుద్ధము యుదును-వారియెడలభక్తిగలిగి వారి విరోధులతో యుద్ధము

---

కావున దీనిని విడిచి యుద్ధమునకు లెమ్ము' అని చెప్పెను. మఱి నర్జునుఁడు(బంధువులవలని)స్నేహమునను కారుణ్యమునను ధ ధర్మభయమునను వ్యాకులుఁడై భగవంతుఁడుచెప్పినది మిక్కి హితమైనదని తెలియక "భీష్మద్రోణాదులు మాకు గురువుల

వలసినదై యుండఁగా వారితోనే యుద్ధము సేయుట యెట్లు?
పట మధుసూదన అనుటచే నీవు మధుని చంపినవాఁడవే కాని
ందీపనిని చంపినవాఁడవు గావు గదా అని మర్మోద్ఘాటనము.

తా. మధుసూదనా, పూజార్హులగు భీష్మద్రోణులపంబు బాణ
యోగము చేసి నేనెట్లు ప్రతియుద్ధము చేయుదును.

శ్లో॥ గురూ నహత్వా హి మహానుభావా
న్ శ్రేయ శ్చర్తుం భైక్ష్య మపీహ లోకే।
హత్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ
భుఞ్జీయ భోగా న్ రుధిర ప్రదిగ్ధాన్॥ 5

టీ. మహానుభావాన్=గొప్పప్రభావముగల, గురూన్ = పెద్ద
ను, అహత్వా=చంపక, ఇహలోకే=ఈలోకమునందు, భైక్ష్
పి=భిక్షాచరణమైనను, చర్తుం=ఆచరించుట, శ్రేయః=మేలు-
హాత్ములగు గురువులను చంపి యనుభవించు భోగములకంటె
రిని చంపక పరధర్మమైన భిక్షాచరణము చేయుటయే మేలు,
ర్థకామాన్=భోగార్థములందు మిక్కిలి కామముగలయట్టి, గు
న్ తు=గురువులనో, హత్వా=సంహరించి, ఇహైవ=ఇచ్చటనే-
రనుభవించినచోట్లనే, రుధిరప్రదిగ్ధాన్=రక్తముచేఁ బూయ
నవియగు-రక్తదిగ్ధులైనగురువులను దలఁపించున వగుటచే
మునువారివలెనే రక్తదిగ్ధములైనట్లె యనుభవింప రాకుండు
ట్టివైన, భోగాన్=భోగములను, (కథం) భుఞ్జీయ=(ఎట్లు)అనుభ

---

ంతిగొప్పగా నెన్నఁదగినవారు.అట్టివారి నెట్లు చంపుదును. ఎట్లని,
గములం దతిమాత్ర మాసక్తులై యున్నవారిని జంపి వారను
వించుచుండునట్టియాభోగములనే వారినెత్తుటితో నంజుకొని వా
మాసనములందుఁ గూర్చుండి యనుభవింతును. ఇట్లు యుద్ధ

వింతును. వారిని జంపుటవలన పరలోకసుఖము లేకపోవుట ం
టుండఁగా వారినెత్తుటఁ దోఁగిన ట్లున్నయీభోగముల ననుః
వించుటచే ఇహలోకసుఖములును గలుగవని భావము.

తా. మహానుభావులును నాకు గురువులునైన భీష్మద్రోణాః
లను జంపుటచే లభించెడిభోగముల ననుభవించుటకంటె వా
ని జంపక భిక్షాచరణమైనను చేయుటయే మేలు. ఏలనఁగా ః
రు విరక్తులుకారు; మనవలెనే భోగములందు మిక్కిలి అపేక్షగ
గియున్నవారు. అట్టి గురువులను జంపితిమా, వారిభోగముల
నుభవించునప్పుడెల్ల నవి నెత్తుటఁదడిసిన యాగురువులను జ్ఞప్తి
దెచ్చుటచే నవియును నెత్తుటఁ దడిసినవానివలెనే యసహ్యాః
లుగాఁ దోఁచును. కాన వానివలన ఇహలోకసుఖమును లేదు. ః
రనుభవించుచుండినభోగములనే వారుండినతావులయందే ః
ర్చుండి యె ట్లనుభవింతును.

శ్లో॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥

టీ. నః=మనకు, కతరత్=ఏది, గరీయః=శ్రేష్ఠమో, ఏతత్
దీనిని, న విద్మః=ఎఱుఁగకున్నాము. జయేమ యద్వా=మనమేః
యింతుమో, నః=మనలను, జయేయుః యదివా=వారే జయిం

---

మారంభించి యావ్యాపారమునుండి మరలినయెడ మిమ్ము ధా
ర్తరాష్ట్రులు బలవంతముగాఁ జంపుదు రందువేని, చంపనిమ్ము. వా
వధింపఁగాఁగలిగెడుయుద్ధర్మపు గెలుపునకంటెను ధర్మాధర్మముః
దెలియకున్న ట్టివారిచే మాకు చచ్చుటయే గొప్పయని నా

ః, యాన్=ఎవరిని, హత్వా=చంపి, నైవజిజీవిషామః=బ్రదుకనే
యిచ్ఛగింపమో-అనఁగా అట్టివారిని జంపుటకంటె వారిచే మన
ము చచ్చుటయే మేలని భావము, తే ధార్తరాష్ట్రాః=అట్టి దు
ర్యోధనాదులు, ప్రముఖే=ఎదుట- మనలనుజంపఁగోరినవారై తా
ము మనచేఁ జచ్చుట కనువుగాను, అవస్థితాః=నిలిచియున్నారు.

తా. యుద్ధముచేయుట మేలో మానుట మేలో, మనమే
యింతుమో వారలకే జయముకలుగునో యెఱుఁగఁజాలము.ఎ
వ్వరిని వధియించినపిదప మనము బ్రదికియుండఁ గోరనే కోరమో
అట్టి భీష్మ దుర్యోధనాదులు యుద్ధసన్నద్ధులై కట్టెదుట నిలిచి
యున్నారు. (అట్టివారిని జంపుటకంటె వారిచే చంపఁబడుట
మేలని నాకుఁ దోఁచుచున్నది.)

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ 7

టీ. కార్పణ్య ... స్వభావః-కార్పణ్య = కృపణత్వమనెడి, దో
=దోషముచేత, ఉపహత = కొట్టఁబడిన, స్వభావః=స్వభావము
అనఁగా ధైర్యము)గలవాఁడనగు, (అహం=నేను), ధర్మసమ్మూఢ
చేతాః=ధర్మమునందు సందియముపొందిన మనసు గలవాఁడనై,
త్వాం = నిన్ను, పృచ్ఛామి = అడుగుచున్నాను. యత్ =ఏది, శ్రే
యః=మేలు అని, నిశ్చితం= నిశ్చయింపఁబడినది, స్యాత్ =అగునో,

---

తోఁచుచున్న"దని చెప్పి "ఏది నాకు మేలని నిశ్చయింపఁబడినదో దా
ని శరణాగతుఁడనైననీశిష్యునకు నాకు చెప్పుము" అని అతిమా
నము దీనుఁడై భగవంతునిపాదములనంటఁగొన్నవాఁడయ్యెను.

తత్ = దానిని, మే=నాకు, బ్రూహి=చెప్పుము. తే=నీకు, అహం=నేను, శిష్యః=శిష్యుఁడను. త్వాం = నిన్ను, ప్రపన్నం=శరణుచొచ్చిన, మాం=నన్ను, శాధి=శాసింపుము.

తా. స్వజనమును జంపెద నని మనస్సు దీనమగుటవలన స్వాభావిక మగునాధైర్యము చెడఁగా, ధర్మ మిదియని తెలియ మనస్సున సందియము పొంది నిన్నడుగుచున్నాను. ఏది నిశ్చయముగా శ్రేయస్కరమై యుండునో దానిని నాకుఁ జెప్పుము నీకు నేను శిష్యుఁడను. నిన్ను శరణముఁ జొచ్చితినిగాన శాస్త్రరహస్య ముపదేశించి యిట్లుచేయుము అట్లుచేయకుము అని నన్ను శిక్షింపుము.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్ ।
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్॥

టీ. భూమౌ=భూమియందు, అసపత్నం = శత్రువులు లేనట్టియు, ఋద్ధం=సమృద్ధమైనదియునగు, రాజ్యం=రాజ్యమును, సురాణాం=దేవతలయొక్క, ఆధిపత్యంచ=ఆధిపత్యమునుగూడ, అవాప్యాపి=పొందియును, ఇన్ద్రియాణాం=ఇంద్రియములకు, ఉచ్ఛోషణం = అత్యంతసంతాపకరమయిన, మమ=నాయొక్క, శోకం దుఃఖమును, యత్=ఏది, అపనుద్యాత్ =పోఁగొట్టునో, (తత్ దానిని,) న ప్రపశ్యామి హి=కానకున్నానుగదా.

తా. నిష్కంటకమును సమృద్ధమునైనట్టి మహీరాజ్యమాత్రముకాదు; దేవాధిపత్యముసయితము లభించినను, బంధుశోకోద్వేగముననింద్రియములనుశోషింపఁజేయుచున్న నాశోకః

విధమునందొలఁగునో అట్టియుపాయము నాకుఁ గానఁబడకున్నది.

సఞ్జయ ఉవాచ= సంజయుఁడు పలికెను.

శ్లో॥ ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః।
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ॥9

టీ. పరన్తపః=శత్రుసంహారకుఁడైన, గుడాకేశః=అర్జునుఁడు, హృషీకేశం (ప్రతి)=శ్రీకృష్ణునిఁ (గూర్చి), ఏవం=ఇట్లు, ఉక్త్వా= పలికి, న యోత్స్యే = యుద్ధముచేయను, ఇతి=అని, గోవిన్దం = కృష్ణునితో, ఉక్త్వా=చెప్పి, తూష్ణీంబభూవ=ఊరకుండెను, హ= ఆశ్చర్యము. హృషీకేశుఁ డనుటవలన అర్జునుని హృషీకములను ఇన్ద్రియములను వినుటకై పురికొల్పినాఁడని తెలియునది.

తా. శత్రుసంహారకుఁడైనయర్జునుఁడు శ్రీకృష్ణునిఁ గనుం గొని యీ తెఱఁగునఁ బలికి యుద్ధముచేయనని యూరకుండెను. మహాశ్చర్యము.

అవ. ఇట్లు తగనియెడ, స్నేహమును కారుణ్యమును ప్రా ప్తింపఁగా నర్జునుఁడు తనప్రకృతిని దప్పినవాఁడై క్షత్రియులకు యుద్ధము పరమధర్మమయ్యును అధర్మమనితలఁచుచు ధర్మమిది యనియు అధర్మమిదియనియుఁ దెలియక వ్యాకులతచెంది ధర్మ మును దెలియఁగోరి శరణాగతుఁడుకాఁగా నతనినుద్దేశించి, భగ వంతుఁడైన శ్రీకృష్ణుఁడు, 'ఆత్మ నిత్యమైనది భగవదధీనమైన ది' అనెడి శుద్ధాత్మస్వరూపవిషయ మైనజ్ఞానముచేతను, 'ఫలా భిసంధిరహితముగ యుద్ధముసేయుట అట్టి ఆత్మస్వరూపప్రా ప్తికి ఉపాయమగును' అనెడిజ్ఞానముచేతను, తప్ప తక్కినవిధ ముల వీనియజ్ఞానము ఉపశమింపదని యోచించి యధ్యాత్మ శాస్త్రము నవతరింపఁ జేయువాఁడయ్యెను.

శ్లో॥ త మువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।
సేనయో రుభయో ర్మధ్యే విషీద న్త మిదం వచః ॥ 10

టీ. హేభారత=ఓధృతరాష్ట్రుఁడా, హృషీకేశః=శ్రీకృష్ణుఁడు, ఉభయోః సేనయోః=రెండుసేనలయొక్క, మధ్యే=నడుమ, విషీద న్తం=దుఃఖించుచున్న, తం=ఆయర్జునునిఁగూర్చి, ప్రహసన్నివ=పరిహసించుచున్నవానివలె, ఇదం వచః=ఈవాక్యమును, ఉవాచ =పలికెను.

తా. రాజా,(ఇట్లు అర్జునుఁడు దేహము వేఱు ఆత్మ వేఱు అఁ దేహాత్మల యథార్థస్వరూపమును వాని పరస్పరభేదమును దెలి యనందున శోకము నొందెను;నుఱి,'దేహమునకంటె ఆత్మ వేఱు అని ఆ రెంటి స్వరూపములను పరస్పర భేదమును తెలిసిచెప్పెడ ధర్మములను మాటాడెను. ఇట్లు పరస్పరవిరుద్ధము లైనగుణమ లతోఁ గూడినవాఁడై, తటాలున ప్రయత్నముమాని, యుద్ధము కుద్యుక్తములైన రెండుసైన్యముల నడుమ దుఃఖపడుచున్న అ ర్జునునిఁ జూచి, పరమపురుషుఁడుపరిహాసవాక్యము లాడువానివ (ఆత్మయొక్కయు పరమాత్మయొక్కయు యథార్థస్వరూపమ ను బొందుట కుపాయములైన కర్మయోగ జ్ఞానయోగ భ యోగములుగలదియు 'నత్వేవాహంజాతు నాసమ్' అనుటవె దలుగా 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశ చః' అనువఱకుఁగలదియు నగు) ఈవాక్యమును జెప్పెను.

శ్రీభగవానువాచ=భగవంతుఁడు చెప్పెను.

శ్లో॥ అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాష
గతాసూ నగతాసూం శ్చ నానుశోచ న్తి పణ్డితాః ॥

టీ. త్వం=నీవు, అశోచ్యాన్ ప్రతి=శోకింపఁదగనివానిని గ

), అన్వశోచః=దుఃఖించితివి-దుఃఖించుచున్నావనుట, ప్రజ్ఞావా
రాంశ్చ=దేహాత్మస్వభావములనుగుఱించి ప్రజ్ఞ గలిగియున్న వా
ములను-అనగా దేహాత్మస్వభావముల నెఱింగినవా రాడువమా
లను, భాషసే=పలుకుచున్నావు, గతాసూన్=పోయినప్రాణము
లగలవానిని గుఱించియు-అనగా స్వభావముచేత అచేతనము
ఆత్మసంయోగవియోగములచేత జన్మమరణములం బొందు
పండుశరీరములంగూర్చియు, అగతాసూన్=పోనిప్రాణము గలవా
ంగూర్చియు- అనగా ఉత్పత్తివినాశములు గలశరీరములకంటె
ఱగుటచే నిత్యములును చేతనములునగు ఆత్మలంగూర్చియు,
ణ్డితాః= ఆ దేహాత్మస్వభావముల యథార్థస్థితి నెఱుంగువారు, న
నుశోచన్తి=దుఃఖింపరు.

తా- అర్జునా, నీవు శోకింపఁదగనివానిం గూర్చి శోకించెదవు.
పతి*'పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః' ఇత్యాది
దేహాత్మస్వభావముల నెఱిఁగి చెప్పెడుమాటలు పలికెదవు.
దేహాత్మస్వభావముల నెఱిఁగినవారికి నిందు శోకింపవలసిన నిమి
త్తము కొంచెమైనను లేదు. దేహాత్మస్వరూపములు దెలిసిన
ారు దేహము లనిత్యములు గాన వానింగూర్చియు, ఆత్మలు
త్యములుగాన వానినిగూర్చియు, దుఃఖింపరు. ఆత్మ వేఱైనది
ని తెలియక వీరిదేహములనే ఆత్మగాఁ దలఁచి వీరిని జంపు
న్నానే యని శోకించుటయు, దేహమునకంటె ఆత్మ వేఱు అని

* చూడు ౧ అధ్యా-౪౨శ్లో-ఈలోకమునుండి ఆత్మలు పరలోకమున
ఁబోవుట, పితృదేవతలగుట, పిండోదకములుగొనుట మొదలైనమాటలు,
హమునకంటె ఆత్మ వేఱై దానివలె నిచ్చటనే నశింపక నిత్యమై యుండునని
హాత్మస్వరూపజ్ఞానముచే చెప్పునట్టిమాటలుగాఁ దెలియునది.

తెలియుటచేఁ జెప్పునట్టి 'ధర్మము అధర్మము' అనుమాటలను పలుకుటయు,నను నిది,నీయందుమిక్కిలి ప్రతిషిద్ధముగా కనఁబడుచున్నది. కాఁబట్టి నీవు దేహస్వభావము నెఱుఁగవు. దేహమునకంటె ఆత్మవేఱై నిత్యమైనదనియు, అట్టియాత్మప్రాప్తికిని ఉపాయము యుద్ధాదికమైన ధర్మమనియు నెఱుఁగవు.ఈయుద్ధము ఫలాపేక్ష లేక చేసినయెడల నిది ఆత్మయొక్క యథార్థస్వరూపమును బొందుట కుపాయమగును. (ఆత్మకు జననమరణములు లేనందున,దానికి జననముచేత కలుగుటగాని మరణముచేత నశించుటగాని లేదు. కాఁబట్టి దానినిగుఱించి శోకింపనక్కఱలేదు. దేహమో కుండమొదలైనవానివలె అచేతనమై పరిణామస్వభావముగలది గనుక దీనికి ఉత్పత్తివినాశములు స్వాభావికములు. కాఁబట్టి దీనినిగూర్చియు శోకింప నక్కఱలేదు. ఇట్లు రెంటికిఁ గలస్వభావములిట్టివని తెలియక వానినిగూర్చి దుఃఖించుచున్నావు.

అవ. దేహాత్మస్వభావములను చెప్పఁబూని మొదట ఆత్మస్వభావమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ న త్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామః సర్వే వయ మతఃపరమ్॥ 12

టీ. అహం=నేను, జాతు=ఒకప్పుడును, నాసం(ఇతి)తు=లేకుంటిని (అనునది), నఏవ=లేనేలేదు, త్వం=నీవు,(నాసీరితి)న= లేకుంటివనునది) లేదు. ఇమే=ఈ, జనాధిపాః=రాజులును, (నాసన్నితి)న=(లేకుండిరనునది)లేదు. వయంసర్వే=మన మందఱమును, అతః పరం=ఇఁక మీఁదను, నభవిష్యామః (ఇతి) చ = లేకపోయెదము అనునదియును, నఏవ=లేనేలేదు.

తా. మీకందఱికి ఈశ్వరుఁడగు నేను ఇప్పటికిఁ బూర్వమనా

గానున్న కాలమున నొకప్పుడును లేకున్నవాఁడనుగాను. నాకు శితవ్యులైన సమస్తక్షేత్రజ్ఞులలో నొకఁడవగు నీవును తక్కిన యీ రాజులందఱును అట్లే మున్నెప్పుడును లేకున్నవారుగారు. నేనును మీరును అందఱమును ఇఁక మీఁద లేకుందుమనుట లే లేదు.(అనఁగా పరమాత్మయు సర్వేశ్వరుఁడనగు నేనెట్లు నిత్యుఁ నుటకు సందేహము లేదో అట్లే క్షేత్రజ్ఞులైన యాత్మలు మీరును త్యులే యని తలంపవలయును).

అర్జునుఁడు బంధులను వధింపనోపక వారి దేహములే యాత్మ నియు, అవి బాణాదిహతములై నశించునని తలఁచుటచే అనిత్య ములనియు, అజ్ఞానముచే మోహితుఁడు కాఁగా, వానికిఁ గలి నయా మోహమును దొలఁగించుటకై భగవంతుఁ డాయా ల పారమార్థికనిత్యత్వమును 'నత్వేవాహమ్' మొదలుగా పదేశింపఁబూనిన సమయమున 'అహమ్' 'త్వమ్', 'ఇమే', సర్వే' 'వయమ్' అని తన్నును దక్కినవారిని వేఱువేఱ చెప్పెను; న, తనకును ఆత్మలకును, ఆత్మలలో ఒకటికొకటికిని, భేదము రమార్థికమైనదని భగవంతుఁడే చెప్పినాఁడని తెలియుచున్నది.

*(శంకరీయులు)ఇందులకు "దేహభేద మనువర్తించుటంబట్టి యు

---

* శంకరులు 'బ్రహ్మమొకటితప్ప మఱిద్దియును లేదు. బ్రహ్మము, మాయ వేశింపఁగా, తన్ను పెక్కువస్తువులుగా భ్రమించుచున్నది. కాన జగమునందు సుఁడు సోముఁడు ఇత్యాదులందలి చిత్తులును (ఆత్మలును), దేహము ఘటము టము ఇత్యాదులైన యచిత్పదార్థములును (అనఁగా బ్రహ్మము తప్ప తక్కిన నావస్తుభేదములన్నియు) మిథ్యలు ; భ్రాంతికల్పితములు. దేహములు మిథ్య య్యును, పైకి అవి పెక్కులు వేఱువేఱుగాఁ దోఁచుటచే దానింబట్టి వ్యవహార మున భగవంతుఁడు 'నేను' 'నీవు' అని యిట వేఱువేఱ నిర్దేశించినాఁడుగాని

ట్లు వేఱువేఱ చెప్పినాఁడే కాని యాత్మభేదమునుబట్టి కా''దన్న చొ

---

దానిచే ఆత్మలు పెక్కులు వేఱువేఱ గలవని తలఁపరాదు. దేహభేదములు పెక్కు
లు కనఁబడుటయు అజ్ఞానమూలమైన భ్రాంతియే. జ్ఞాన ముదయింపఁగానే ఈ
భేదములన్నియు నశించి బ్రహ్మమొక్కటియే యంతటను గనుపట్టును' అనెదర
భాస్కరులు 'బ్రహ్మమొక్కటియే. దానినుండి అచిత్తు పుట్టి దేహాదిరూపము
ఉపాధులై బ్రహ్మముయొక్క యంశములను ఆవరింపఁగా, అట్లావరింపఁబడి
బ్రహ్మాంశములే, భ్రాంతివలన, జీవులుగా తోఁచును గాని జీవులు బ్రహ్మముకం
వేఱుగారు. ఇట్లు జీవులు మిథ్యలయ్యును వాని యుపాధులైన దేహములు స
ములై పెక్కు వేఱువేఱుగానున్నవి గాన ఈయుపాధుల భేదమునుబట్టి 'నే
'నీవు' అని వేఱువేఱ నిర్దేశము కలిగె'నందురు. రామానుజులు, 'జగత్తునందలి భేద
లన్నియు సత్యములే. ఏదియు మిథ్యగాదు. కనుక బ్రహ్మము వేఱు; జీవులు నే
జడములు పెక్కులు; పరస్పరమును వేఱువేఱు. కావుననే 'నేను' 'నీవు' అని వే
వేఱ నిర్దేశము తగియున్నది. శంకరులు, కేవల దేహభేదమును బట్టి యట్లు చె
బడెనుగాన ఆత్మభేదము లేదనుట సరికాదు. అర్జునుఁడు భ్రాంతుఁడైయున్నా
డు. వానికి, వారిమతము చొప్పున భ్రాంతికల్పితములైన దేహముల భేదమును
'నేను' 'నీవు' అనుట మఱింత భ్రాంతికరము. వానిభ్రాంతి నివర్తింపవలయును.
ను' 'నీ' వనుట భ్రాంతినివర్తించుటకై పఠించిన మంత్రముగాదు. మంత్రమేని
యభిప్రాయమేమైననుగావచ్చును. అది భ్రాంతినివృత్తికై యుపదేశించిన త
వాక్యము. కాన యట్లు వేఱువేఱనిర్దేశించినందులకు ఆత్మభేదము సత్యమైయుం
వలయును. భాస్కరులు చెప్పునదియు సరిగాదు. వారిమతముచొప్పున దేహ
దము సత్యమైనను ఆత్మలు మిథ్యలు గావున ఆత్మభేదమును మిథ్యయే. కాన త
ముపదేశించునపుడు 'నేను' 'నీవు' అని వేఱువేఱ నిర్దేశించుట ఆత్మభేదము
మని అర్జునునకు తోఁపించునుగాన అతాత్త్వికమైనయట్టి వాక్యము భగవంతు
చెప్పఁడు. కనుక ఆత్మలు పెక్కులై పరస్పరము వేఱువేఱైయుండిననే 'నేను' '
[illegible] భేదమును సిద్

దేహభేదమును వారినుతముచొప్పున మాయాకృతముగాన అ
పారమార్థిక మైనది. పారమార్థికవిషయ ముపదేశింపవలసినప్పుడు
అపారమార్థిక దేహభేదమును ఈశ్వరుఁడు ప్రసంగింపఁడు. (భాస్క
రీయులు) "దేహాద్యుపాధి సత్య మగుటంబట్టి దేహభేదము పార
మార్థికము గాన దానింబట్టి యట్లు వేఱువేఱు నిర్దేశించినాఁ"డన్న
చో, దేహభేదము సత్యమైనను దానింబట్టి తోఁచుఆత్మభేదము అస
త్యముగనుక తత్త్వోపదేశసమయమున తాత్త్వికము కానియా
భేద మేర్పడునట్లు 'నేనునీ'వని నిర్దేశించు ననుట యొప్పదు. శ్రుతియు
'నిత్యోనిత్యానాంచేతన శ్చేతనానా మేకో బహూనాం యోవి
దధాతికామాన్' (నిత్యులై యనేకులైన చేతనులకు, నిత్యుఁడగు
చేతనుఁ డొకఁ డెవ్వఁడో వాఁడు కోరికల నొడఁగూర్చుచున్నాఁ
డు)అని ఆత్మలకు భేదము స్వాభావికమైనదిగా చెప్పుచున్న దేకాని
సత్యోపాధిచేఁగాని మిథ్యోపాధిచేఁగాని కల్పితమైన దనలేదు.

"అజ్ఞానకృతమైన భేదదృష్టిచే అట్లు 'నేను నీవు' అనుభేద
ము నిర్దేశించినాఁ"డన్నచో, ఇచట నుపదేశించువాఁడు పరమ
పురుషుఁడు. పరమార్థమైనది వానిదృష్టి కవశ్యముగో చరింపక
మానదు. కాన † నిర్విశేషమై, కూటస్థమై, నిత్యమై, చైత
న్యరూపమై యున్నయాత్మస్వరూపము సాక్షాత్కరించుటవలన
తనికి అజ్ఞానమును (అవిద్యయు) తత్కార్యమైన భేదభ్రమ
మును నివర్తించియుండఁగా, అజ్ఞానమువలన 'నేను' 'నీవు'
అని భేదమును కనుఁగొనుటయు, తన్మూలమున తన్ను గురువు

* శ్వేత-ఉ.౬-౧౩. † సజాతీయవిజాతీయస్వగతభేదరహితము
నిర్విశేషము. నిర్వికారమైనది కూటస్థము.

గాను ఎదిరిని శిష్యునిఁగాను దలఁచి యుపదేశాదివ్యాపారములు సేయుటయు, నొప్పవు.

"భగవంతునికిఁ గలిగి యున్న యద్వైతజ్ఞానముచే భేదజ్ఞానము బాధితమై పోయినను, వాసనావశమునమరల ననువర్తించుచున్నది. కాన, బాధితానువృత్తిరూపమైన (అనఁగా బాధింపఁబడియు మరల ననువర్తించునట్టిదైన) యాభేదజ్ఞానముచే ఈశ్వరుఁడు 'నేను' 'నీవు' అనుభేదము నిర్దేశించినాఁడు. అయినను ఒకవస్త్రము కాలిపోయినపిదప నది తనవస్త్రాకారమును విడువకుండినను పూర్వమువలె నెట్లుపయుక్తము కానేరదో యట్లే భేదజ్ఞానము అద్వైతజ్ఞానముచే బాధితమైనపిదప వాసనారూపముగా అనువర్తించినను పూర్వమువలె పరమపురుషునికి బంధకము కానేరదు" అన్న యెడల నదియొప్పదు. ఎట్లన, ఎండమావులనుజూచి నప్పుడు మొదట జలజ్ఞానముగలిగియు పిదప నది జలము కాదనెడి జ్ఞానముచే ఆజలజ్ఞానము బాధితమగును. అట్లుబాధితమై యది యనువర్తించియు నాయెండమావులనుండి జలము తెచ్చుకొనుట మొదలైన ప్రవృత్తుల నది కలిగింపదు. అట్లే యిందును, అద్వైతజ్ఞానముచే భేదజ్ఞానము బాధితమైనపిదప అనువర్తించుచున్నను, అది మిథ్యార్థములను గుఱించినదే యగునని నిశ్చయముండుటవలన, అది మిథ్యాభూతులైనశిష్యాదులను గుఱించి ఉపదేశాదిప్రవృత్తులను గలిగింపనేరదు. మఱియునీశ్వరునికి మొదట అజ్ఞానముండిననేకదా అది శాస్త్రాధిగతతత్త్వజ్ఞానముచే పిదప బాధితానువృత్తి యగును. ఈశ్వరునకజ్ఞానమున్నదనుట *'యస్సర్వజ్ఞస్సర్వవిత్', † 'పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే

* ముం-ఉ. ౧-౧-౯; ౨-౨-౭. † శ్వే. ఉ. ౬-౭.

స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ', *'వేదాహం సమతీతాని వర్తమానానిచార్జున। భవిష్యాణిచభూతాని మాంతు వేద న కశ్చన॥' ఇత్యాది శ్రుతిస్మృతులకు విరుద్ధము. కనుక అజ్ఞానమే లేనప్పుడు అది బాధితానువృత్తియగు ననుటయే యశక్యము.

మఱియు పరమపురుషునికిని ఇప్పటి గురుపరంపరకును 'ఆత్మస్వరూపము ఒక్కటియే; దానికి రెండవది లేదు' అను నిశ్చయముండు నేని, భేదజ్ఞానము అనువర్తించినను, రెండవది లేనిదిగా తాము నిశ్చయించిన యాత్మస్వరూపమును రెండవవాని కెవని కుపదేశింతురు? అని యడుగవలసియున్నది "నిజముగా రెండవది లేకున్నను ప్రతిబింబమువలె తోఁచుచున్న అర్జునుఁడు మొదలైన రెండవవారి కుపదేశింతు"రన్నచో వెఱ్ఱిలేనివాఁ డెవఁడుగాని మణులు కత్తులు అద్దములు మొదలైనవానియందుఁ దోఁచుచున్న తన బింబములనుజూచి యవి తనకంటె వేఱుకావని తెలిసి వాని కేయర్థమునుగాని యుపదేశింపఁడనఁగా, ఇఁక మోక్షార్థము నుపదేశించుటయే కలుగదు. బాధితానువృత్తి గలుగునని యొప్పుకొని యింతవాదము సేయనేల. మొదట బాధితానువృత్తి గలుగునని చెప్పుటయే వారికి నొప్పదు. ఎట్లన, ఆత్మవ్యతిరిక్తభేదజ్ఞానమునకు (అనఁగా ఆత్మకంటెవేఱైనవానిని తోఁపించుజ్ఞానమునకు) కారణము అనాదిదోషము. అది బాధకమైన అద్వితీయాత్మజ్ఞానము చేత, (అనఁగా ఆత్మకంటె రెండవది లేదనుజ్ఞానము చేత) నశించినదై యున్నది. ఇట్లు అద్వితీయాత్మజ్ఞానము చే నాశితమై కారణమైనదోషమే లేకుండఁగా తత్కార్యమైన భేదజ్ఞానము ఘటించుట యెట్లు? అది ఘటింపనప్పుడు బాధితానువృత్తియగుటయే యెక్కడిది?

---

* గీతా. ౭-౨౬.

"చంద్రుఁ డొకఁడయ్యును కంటియందలి తిమిరాదిదోషములచే ఇద్దఱు చంద్రులు గనఁబడుదురు. చంద్రుఁ డొకఁడే యనుజ్ఞానముచే ద్విచంద్రజ్ఞానము బాధితమయ్యును అనువర్తించునట్లు, అద్వైతజ్ఞానముచే భేదజ్ఞానము బాధితమయ్యును అనువర్తించు" నన్నచో, చంద్రైకత్వజ్ఞానముచే ద్విచంద్రజ్ఞానము బాధితమైనదికాని, ఆద్విచంద్రజ్ఞానమునకుఁ గారణమైన తిమిరాదిదోషము పారమార్థికమైనదిగాన బాధితము కాకుండును. కనుక, పారమార్థికకారణముండు వఱకును తత్కార్యమైనద్విచంద్రజ్ఞానము బాధితానువృత్తియగుట (అనఁగా బాధితమయ్యు ననువర్తించుచుండుట) యుక్తమే. అట్లు అనువర్తించుచున్నను అది చంద్రుఁ డొకఁడే యను ప్రబలప్రమాణముచే బాధితమగుటవలన ఏమియుఁ జేయనేరదు. ఇందో, భేదజ్ఞానమును దానివిషయములును దానికారణమును అన్నియు అపారమార్థికములు. కనుక వస్తుయాథాత్మ్యజ్ఞానముచే అపారమార్థికములైన భేదజ్ఞానమును దానివిషయములును దాని కారణమును అన్నియు నశించియుండఁగా ఎట్లును బాధితానువృత్తి కలుగనేరదు. కారణసహితముగా నశించినపిదప కార్యమెట్లుండును. కాఁబట్టి సర్వేశ్వరునికిని ఇప్పటి గురుపరంపరకును తత్త్వజ్ఞానముండినా గురుశిష్యాది భేదదర్శనముగాని తత్కార్యములైనయుపదేశాదులుగాని కలుగవు; భేదదర్శన ముండినా దానికిహేతువైన యజ్ఞానమును వారి కుండునుగాన ఆయజ్ఞత్వముంబట్టి వా రుపదేశము సేయుటయెంతయుఁ గలుగనేరదు.

["మఱియు బ్రహ్మమొకటియే అవిద్యావశంబలమై జీవుఁడగును. కావున జీవుఁ డొక్కఁడేకాని పెక్కండ్రు లేరు. కలఁ గనువానికి

లలోఁ గనఁబడు పురుషులవలె ఆయేకజీవునికి భ్రాంతివలన అనేకజీవులు ప్రతిభాసింతురు. కలగన్నవానికి మేలుకొనుటచే కలలోఁగనఁబడిన వెల్ల బాధితములగునట్లు ఆయేకజీవునికి ఒకప్పుడు గలుగుతత్త్వజ్ఞానముచే వానికిఁగనఁబడెడి యీమిథ్యాప్రపంచము బాధితమగును" అందురు. అట్టైన నుపదేశము సేయు వాసుదేవాది గురువులెవరు? ఆయేకజీవుఁడా? లేక వానిచేఁ జూడఁబడు మఱియొకరా? మఱి యర్జునాదిశిష్యులు అతఁడా? లేక అతనిచేఁ జూడఁబడు మఱియొకరా? అనియడుగఁదగును. జీవభూతుఁడైన యాబ్రహ్మమే గురుఁడేని అప్పుడట్టి] గురువునకుఁ గల అద్వితీయాత్మవిజ్ఞానమువలననే (అనఁగా తనకంటె రెండవది లేదను నెఱుకవలననే) ఆబ్రహ్మమునకుఁ గలయజ్ఞానమును తత్కార్యములైన శిష్యాచార్యత్వాదిభేదములును నశింపఁగా అట్లు నశించిన శిష్యునిఁగూర్చి యుపదేశము సేయుటవలనఁ బ్రయోజన మేమి? ["గురుఁడాయేకజీవుఁడుకాఁడుగాని వానిచేఁ జూడఁబడు మఱొకఁడగును. జీవుఁడొకఁడే కలఁడుగాన వానిచేఁ జూడఁబడుమఱొకఁడైన యాగురువును అతని అద్వైతజ్ఞానమును కల్పితములే యగును. అయినను కలగనువానిచే కలయందు కల్పితుఁడైన యొకపురుషునియొక్క విజ్ఞానమువలన ఆకల బాధితముకానట్లు ఆయేకజీవునిచే కల్పితమైన యాగురువుయొక్క విజ్ఞానముచే ఆజీవునికిఁ దోఁచు మిథ్యాప్రపంచము బాధితముకానేరదు, అది బాధితమగుటకై కల్పితుఁడైనయాగురువు తనజ్ఞానము నుపదేశింపవలసియున్నదిగాన ఉపదేశమునిష్ప్రయోజనముగాదు" అన్నచో, ఉపదేశార్థమైన యా]గురువును అతనిజ్ఞానమునుఁ కల్పితములేని [శిష్యుఁడును ఆయేకజీవుఁడే యనుటకు ప్రమాణము లేదు గాన]

శిష్యుడును వాని యద్వైతజ్ఞానమును [నిజములనుటయెట్లు? వి
వియును] గల్పితము లేయగును గాన శిష్యునియొక్క కల్పితజ్ఞాన
మును వానియజ్ఞానమును నివర్తింపఁజేయనేరదు. "శిష్యుని య
ద్వైతజ్ఞానము కల్పితమైనను పూర్వమున్న భేదజ్ఞానమునకు వి
రోధి యగుటచే దానిని నివర్తింపఁజేయు" నన్నచో నప్పు డాచా
ర్యజ్ఞానమును అట్టిదే యగును. అదియె యాభేదజ్ఞానమును ని
వర్తింపఁజేయును. అనఁగా జీవుఁ డొక్కఁడే కాన ఆచార్యునికి
గలయద్వైతజ్ఞానముచేతనే జీవునకు పూర్వమున్న భేదజ్ఞానము
నివర్తింపఁగా అంతటను గలశిష్యాచార్యత్వాదిభేదములన్నియు
నశించునుగాన శిష్యునికుపదేశమే నిరర్థకమగును. ఇఁక శిష్యునిజ్ఞా
నముతోఁబనియేమి? కాన అద్వైతసిద్ధాంతము అనుపపన్నము.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తరప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి॥ 13

టీ. అస్మిన్ దేహే=ఈ ఒక్కదేహమునందు, దేహినః=ఆత్మ
కు, కౌమారం=బాల్యము, యౌవనం= యౌవనము, జరా=ముసలి
తనము, యథా(భవన్తి) = ఎట్లుకలుగుచున్నవో, తథా=అట్లు, దే
హాన్తరప్రాప్తిః=(ఈశరీరమునశించి) మఱియొకశరీరమును బొం
దుటయును, (భవతి=కలుగుచున్నది), తత్ర=ఆవిషయమున, ధీరః
=బుద్ధిమంతుఁడు, నముహ్యతి=మోహమునొందఁడు-భ్రమింపఁడు.

తా. ఒకదేహమునందలి ఆత్మకు ఆదేహమునందే బాల్య
ము యౌవనము వార్ధకము ఎట్లుసంభవించునో, అట్లే దేహాంత
రమును గలుగుట నిశ్చయము. ఈవిషయమునందు బుద్ధిమంతుఁ
డు భ్రమింపఁడు.

బుద్ధిమంతుఁడు, ఒకశరీరమునకు బాల్యావస్థపోయి మఱియౌ

రాద్యవస్థలు కలుగునపుడు ఆశరీరమునందుండుఆత్మ స్థిరమైన
పబుద్ధితో అది నశించినదియని దుఃఖింపక యెట్లుండునో,
ట్లే ఆ దేహముపోయి మఱియొక దేహము కలుగునపుడును ఆ
రాత్మ అట్లు నశింపకయె యున్నదనితలఁచి దుఃఖింపఁడు. బా
ృద్ధ్యవస్థలు దేహమునుబట్టి ఆత్మకు సంభవించునట్లు జన
మరణములును దేహమునుబట్టియే ఆత్మకు కలుగుచున్నవి.
ఁబట్టి ఆత్మ, నిత్యమగుటచే ఆత్మవిషయమై దుఃఖింప
ాడదు. మఱి చేయవలసినదేమియనఁగా:-నిత్యములేయగు ఆ
్మలు అనాదికర్మవశ్యములై ఆయాకర్మములకు తగినదేహము
ను బొందుచుండును. ఆయాదేహమువలన ఆత్మకుఁ గలిగినబం
ము నివర్తించుటకొఱకు ఆ దేహముచేతనే *శాస్త్రీయములై
్వవర్ణోచితము లగుయుద్ధాదికర్మములను ఫలాపేక్షవిడిచి యా
రించుచుండవలయును. అప్పుడు ఇంద్రియములు వానివానివి
యములతో సంబంధించుటచేత శీతోష్ణాదులవలన సుఖదుఃఖ
ులు కలుగకమానవు. అయినను, ప్రారంభింపఁబడిన యా
ర్మములు ముగియువఱకును వానిని ఓర్చుకొనియే తీఱవలెను.

అవ. ఈయర్థమును అనంతరమే యిందు చెప్పుచున్నాఁడు.

॥ మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత॥ 14

టీ. కౌన్తేయ=అర్జునా, మాత్రాస్పర్శాః=పంచతన్మాత్రముల
లనఁబుట్టిన శబ్దాదివిషయములతో శ్రోత్రాదీంద్రియములయొ

*శాస్త్రీయములనుటచే ఈశ్వరుని శాసనమునకు లోఁబడనిచో దండము
లుగుననియు, స్వవర్ణోచితము లనుటచే యుద్ధాదులువిడిచి భైక్షమాచరింప
ాదనియు, ఫలాపేక్షవిడిచి యనుటచే మోక్షముకొఱకనియుఁ దెలియునది.

క్క సంబంధములు,శీతోష్ణసుఖదుఃఖదాః=చలివేఁడిమొదలగు సుఖదుఃఖములనుగలుగఁజేయునవి,ఆగమాపాయినః=రాక పోకలుగలవి, అనిత్యాస్తు=ప్రవాహరూపముగా ఎడతెగకుండునవిగావు - బంధహేతువులైన కర్మములు నశింపఁగా తాము నివర్తించి పోవునవనుట,(తస్మాత్ =కావుననే), భారత=అర్జునా, తాన్ =వానిని, తితిక్షస్వ=ఓర్చుకొనుము.

తా. అర్జునా, శబ్దాదివిషయములతో ఇంద్రియములు సంబంధించినపుడు శీతోష్ణసుఖదుఃఖములు కలుగును. అవి వచ్చుచుఁబోవుచు నుండునవి గాన బంధమునకు హేతువులైన కర్మములు నశింపఁగానే నివర్తించునవి. యుద్ధాదులైన శాస్త్రీయ కర్మములు ముగియువఱకు వానిని ధైర్యముతో *సహింపుము.

పృథివ్యప్తేజోవాయ్వాకాశములనెడి పంచభూతములును వానిని ఆశ్రయించియుండెడి శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములును తన్మాత్రములచేఁ గలిగినవిగాన మాత్రలని చెప్పఁబడుచున్నవి. వాని స్పర్శనములు,చలువ వేఁడి మెత్తన పరుసన మొదలగు రూపములతో సుఖదుఃఖప్రదములుగా నుండును. వానికి ఇంద్రియములతోడి సంబంధము లే "మాత్రాస్పర్శములు". తన్మాత్రము లనఁగా భూతములయొక్క సూక్ష్మావస్థలు.

అవ. అట్లు ఓర్చుకొనుట యేల యనఁగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ 15

టీ. హేపురుషర్షభ=ఓపురుషశ్రేష్ఠుఁడైన అర్జునా, ఏతే=ఈ

*దుఃఖమును ఓర్చుకొనుటగలదుగాని సుఖమునుగూడ ఓర్చుకొనుటయననేమియనఁగా దానియందుపేక్షగలిగి ఉబ్బులేకుండుట యని తెలియునది.

షయవాసనలు, సమదుఃఖసుఖం=సుఖదుఃఖములయందు సమ బద్ధిగల- త్రోసి పుచ్చరాకుండుదుఃఖమును సుఖముగా తలఁచు నట్టి, ధీరం=నిశ్చలుఁడైన, యం పురుషం=ఏ పురుషుని, న వ్యథ యన్తి=బాధింపవో, సః హి=వాఁడుగదా, అమృతత్వాయ=మో క్షముకొఱకు, కల్పతే=సమర్థుఁడగుచున్నాఁడు.

తా. అర్జునా, ఏధీరుఁడు త్రోసిపుచ్చరాని దుఃఖమును సుఖ ముగనే తలఁచుచు, మోక్షసాధనముగా స్వవర్ణమునకుఁ దగిన యుద్ధాదికర్మములను ఫలాపేక్షలేక చేయుచుండఁగా, వానిలోఁ గల్గు బాణపాతము మొదలైన మృదుకూ్రరస్పర్శములు పీడించి నను నోర్చుకొనియుండునో వాఁడే నిత్యానందరూపమగు మోక్ష మును సాధించునుగాని దుఃఖమోర్వఁ జాలని నినుబోఁటివాఁడు గాదు. ఆత్మలు నిత్యములగుటచే వానిని రక్షింపవలసినది లేదు; మఱి వానికొఱకై చేయవలసిన దింతయే యని భావము.

అవ. 'గతాసూనగతాసూంశ్చ' అనియాత్మలు నిత్యము లగుటచేతను, దేహములు స్వాభావికముగా నశించునవగుటచే తను, వానినిగూర్చి శోకింప నిమిత్తములేదని పూర్వము చెప్పిన దానినే ఉపపాదించుచున్నాఁడు.

శ్లో॥ నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥ 16

టీ. అసతః=నశించుస్వభావము గలశరీరమునకు, భావః=ఉండు ట, నవిద్యతే=లేదు. సతః=నశింపనిజీవాత్మకు, అభావః=లేకుండు ట, నవిద్యతే=లేదు. అనయోః=ఈ-కనఁబడుచున్న, ఉభయోరపి =రెంటియొక్కయును, అన్తః=నిర్ణయము, తత్త్వదర్శిభిః=తత్త్వ

నాదించువారును, కామాత్మానః = కామ్యవిషయములయందుమన స్సుగలవారును, స్వర్గపరాః=స్వర్గమునం దాసక్తులునునగు, (యే) అవిపశ్చితః=(ఏ)అల్పజ్ఞానులు, జన్మకర్మఫలప్రదాం = పునర్జన్మ ముకర్మము అనెడి ఫలముల నిచ్చునదియు, క్రియావిశేషబహు లాం=పెక్కులైన క్రియలచేత నతిశయించినదియు,భోగైశ్వర్యగ తిం ప్రతి(వర్తమానాం)=సుఖానుభవము ఐశ్వర్యము అనువీరెంటి యొక్క ప్రాప్తిను ద్దేశించి (ప్రవర్తించు) నదియు, పుష్పితాం= పూచినదానివలె చూపునకు మాత్రమురమ్యమయిన,ఇమాం= ఈ, యాంవాచం=ఏవాక్యమును (కామ్యవిధిపరమగు వేదభాగ మును), ప్రవదన్తి=చెప్పుచున్నారో, తయా=అట్టివాక్యముచేత, అపహృతచేతసాం=అపహరింపఁబడిన ఆత్మజ్ఞానము గలవారైన, (తేషాం)భోగైశ్వర్య ప్రసక్తానాం=సుఖానుభవమునందును ఐశ్వ ర్యమునందును మిక్కిలి ఆసక్తిగల అట్టివారియొక్క,సమాధౌ = మనస్సునందు(ఇట'సమాధీయతే అస్మిన్నాత్మజ్ఞానమ్' అని-ఆత్మ జ్ఞానము సమాహితము అగునట్టి మనస్సు(గాహ్యము), వ్యవసా యాత్మికాబుద్ధిః=నిశ్చయ పూర్వకమగుబుద్ధి, న విధీయతే= చే యఁబడదు- పుట్టదు.

తా. అర్జునా,అల్పజ్ఞులు,వేదములందలి కర్మభాగమున స్వర్గాది ఫలములంగూర్చి చేయఁబడు వాదములయందు తగులువడి ఆవై దికకర్మములకు స్వర్గముకన్న నధికమగుఫలము వేఱొక్కటిలేదని పలుకుచు, కామ్యవిషయములయందు మనసుతగిలినవారుగాన, స్వర్గమునే పొందఁగోరుచుందురు. (అనఁగా మోక్షవిముఖులగుదు రు). మఱియు వేదములందు(కామ్యవిధి భాగపరమైన)యా వా క్యము,మనుజులు యజ్ఞాదివైదిక కర్మములఁజేసి వానిఫలమగు

స్వర్గాదిసుఖము లనుభవించిన వెనుక వారికి మరల జన్మకర్మము లనెడిఫలములను ప్రతిపాదించునేకాని మోక్షమును ప్రతిపాదింపదు; తత్త్వజ్ఞానము లేక అది యనుష్ఠింపఁబడునుగాన యందు మోక్షమనెడి యేకఫలము నుద్దేశించుట కలుగదు. పశ్వన్నాదులైన బహువిధఫలములచే యుద్దేశింపఁబడును. కాన ఆఫలములకు సాధనములైన పలువిధము లగుకర్మములను అది రూపించునదియు నగును. ఇంతేకాక, అది భోగైశ్వర్యముల ప్రాప్తి కొఱకే ప్రవర్తించునదికాని మోక్షమునకుఁగాదు; కావుననే ఫలములేక పుష్పములుమాత్రము కలదానివలె ప్రయోజనము లేక పైకిమాత్రము రమణీయముగా తోఁచుచుండును. అట్టి వేదవాక్యమును, ఆయల్పజ్ఞులు ఎక్కువగా చెప్పకొను చుందురు. అట్టివారు తమకును భోగైశ్వర్యములందు విశేషాభిలాషయుండుటవలన, భోగైశ్వర్యములను గుఱించిన యావాక్యములందు మనస్సుతగిలి దానిచేత ఆత్మజ్ఞానము పోఁగొట్టుకొన్నవారగుదురు. కావున వారిమనస్సునందు, ఆత్మస్వరూపము చక్కగాఁ దెలిసినపిదప మోక్షమునకై సమస్తవైదికకర్మము లనుష్ఠింపవలయు ననెడి బుద్ధి యెన్నటికిని కలుగనేరదు. కాఁబట్టి ముముక్షువునకు కామ్యకర్మములయందు సంగమెపుడును తగదు.

అవ. తలిదండ్రులు వేనవేలమందికంటెను మిక్కిలివాత్సల్యము గలదై ఆత్మోజ్జీవనము మొదలైనహితముల నుపదేశించుటకు ప్రవర్తించుచున్న వేదములు ఇట్లు అత్యల్పఫలములై పునర్జన్మము నుగలుగఁజేసెడి కర్మములను ఏల చెప్పచున్నవి? వేదవిహితమైన కర్మలను ఎట్లు త్యాజ్యమనవచ్చును? అనియడుగఁగాఁ జెప్పచున్నాఁడు.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।

నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45

టీ. వేదాః = వేదములు, త్రైగుణ్యవిషయాః = సత్త్వరజస్తమోగుణములు ప్రచురముగాఁ గలపురుషులనుగుఱించినవి. (త్రయోగుణాః త్రైగుణ్యమ్ అనఁగా-సత్త్వరజస్తమములు; సత్త్వరజస్తమః ప్రచురులైనపురుషులు త్రైగుణ్యశబ్దముచేఁ జెప్పఁబడుదురు. త్రైగుణ్యవిషయములు వేదములు-అనఁగా తమః ప్రచురులకును రజఃప్రచురులకును సత్త్వప్రచురులకును వత్సలతరమైయే వేదములు హితములను బోధించుచున్నవనుట. సామాన్యముగా అందఱికిని ఆమూఁడుగుణములుండును గాన ఇచ్చట 'మూఁడుగుణములుగలవారు' అనఁగా ఆ మూడుగుణములందొకొక్కటియు మిక్కుటముగాఁ గలవారు అని గ్రహింపనలయును), హేఅర్జునా=ఓయర్జునా, నిస్త్రైగుణ్యః=(అన్యోన్యము కలసిన) ఈమూడుగుణములు లేనివాఁడవును-(మూఁడుగుణములు లేకుండుట కష్టముగాన మూఁడునుమిక్కుటముగా లేకుండుటనే యిచట గ్రహింపవలయును) నిర్ద్వన్ద్వః = పుణ్యపాపములు రెంటిచేఁ గలుగు సకలసాంసారికస్వభావములు లేనివాఁడవును, నిత్యసత్త్వస్థః = ఎల్లప్పుడు శుద్ధ సత్త్వగుణమునే ఆశ్రయించినవాఁడవును - ఇప్పుడు సత్త్వప్రచురుఁడైనవాఁడవనుట, నిర్యోగక్షేమః=అప్రాప్తమైనది ప్రాప్తించుట యోగము; ప్రాప్తించినదానిని పరిరక్షించుట క్షేమము; ఆత్మస్వరూపంబును దానిని బొందుటకు సాధనములయినవియును తప్ప తక్కిన వానిని బొందుటయనెడియోగమును ప్రాప్తమైనవానిని రక్షించుట యనెడి క్షేమమును విడిచినవాఁడవును, ఆత్మవాన్=ఆత్మస్వరూపమును వెదకువాఁడవును, భవ=అగుము.

తా. (మిక్కిలిసత్త్వగుణముగలవారుమాత్రమే మోక్షమును గోరుదురు. తక్కిన రజస్తమోగుణములు మిక్కిలిగాఁగలవారు దానిని ఒల్లక స్వర్గాదిసాధనములే కోరుదురు. కనుక వేదములు వీరికి, వీరిగుణముల కనుగుణముగా స్వర్గాదిఫలములను సాధించుటయే హితమని బోధింపవేని,యపుడు వీరు రజస్తమస్సులు మిక్కుటముగాఁ గలవారుగావున సాత్త్వికఫలమైన మోక్షమునకు విముఖులై తామపేక్షించిన స్వర్గాదిఫలములకు సాధనములివియని మఱియొకదానిచే నెఱుఁగలేక కామప్రావణ్యముచే వివశులై ఉపాదేయములు కానివానిని ఉపాదేయములుగా భ్రమించి చెడిపోదురు. కావున వేదములు మిక్కిలి సత్త్వగుణులైనవారికిని, మిక్కిలి రజోగుణులైనవారికిని, మిక్కిలి తమోగుణులైనవారికిని వాత్సల్యముతో వారివారికిఁ దగిన హితములను బోధించుచున్నవి, ఇట్లు) వేదములు మూఁడుగుణములుగలవారిని గుఱించియుఁ బ్రవర్తించుచున్నవి. నీ విప్పుడుసత్త్వమే మిక్కిలి కలిగియున్నావు. దానిని వృద్ధిఁబొందింపుము. మూఁడుగుణములు ఒండొంటితోఁగలిసి మిక్కిలియగునట్లు చేయకుము.వానిని మిక్కుటమగునట్లు పెంపకుము. ఇట్లు వర్తించుటవలన పుణ్యపాపములకుఁ గారణము లగుసంసారబంధములనెల్ల విడిచినవాఁడవై, రజస్తమోరహితమగునట్లు సత్త్వగుణమునుమాత్రము నిత్యమును వృద్ధిపొందించుకొని శుద్ధసాత్త్వికుఁడవుకమ్ము. ఇట్టివాఁడ నగుట కుపాయమెద్దియంటివేని, ఆత్మస్వరూపంబును ఆత్మస్వరూపమును బొందుటకు నుపాయములగునవియును తప్ప తక్కినవానిప్రాప్తినిగోరక, ప్రాప్తించినవాని రక్షణముసేయక ఆత్మస్వరూపమును గనిపెట్టుటయే పనిగా నుండుము. ఇట్లుచేయుదు

వేని రజస్తమస్సుల ప్రాముఖ్యము నశించి సత్త్వము వృద్ధిఁబొందును.

అవ. వేదమునందు చెప్పఁబడినదంతయు సందఱకును ఉపాదేయముకాదని దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యావా నర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ 46

టీ. సర్వతః=అంతటను, సంప్లుతోదకే = నిండియున్న నీరుగల, ఉదపానే = తటాకమునందు, యావాన్=ఎంత, అర్థః = ప్రయోజనమో, విజానతః=ఆత్మజ్ఞానముగల, బ్రాహ్మణస్య = బ్రహ్మజ్ఞాననిష్ఠునకు – ముముక్షువునకు, సర్వేషు=సమస్తములైన, వేదేషు=వేదములయందు, తావాన్ అర్థః=అంతే ప్రయోజనము.

తా. స్నానపానాదినానావిధప్రయోజనములకొఱకుఁ గల్పింపఁబడినదై సర్వత్ర జలపూర్ణమై యుండు తటాకమునందు దప్పిగొన్న మనుజుఁడు త్రాగుట కెంతజలము ప్రయోజనమో అంతమాత్రమే గ్రహించునుగాని జలమునంతయు గ్రహించుటలేదు. అట్లే సర్వాధికారులకొఱకును బ్రవర్తించునదై కావుననే వారి వారికి వలయుసమస్తవిషయములతో నిండియుండునద యగు వేదములం దెల్ల వైదికుండును ముముక్షువును నగువానికి ఎంతమాత్రము మోక్షసాధనమో అంతమాత్రమే ఉపాదేయము (గ్రహింపఁదగినది) గాని వేఱొకటిగాదు.

అవ. కాఁబట్టి సత్త్వనిష్ఠుఁడగునట్టిముముక్షువున *కింతమా

* మోక్షసాధనములు తప్ప తక్కినవన్నియుఁ బరిత్యజించుటచే నిత్యనైమిత్తికాదుల నుల్లంఘింపవలసి వచ్చును. దానిచే కామచారదోషము కలుగును. మఱి పూర్వశ్లోకమున 'తావాన్' అనఁగా 'అంతమాత్రము' అనియున్నది. ఈ శ్లోకమున 'అంతమాత్రము' అన్నందులకు ఇంతమాత్రము అని తెలుపుటచే కావ

త్రమే ఉపాదేయమగునని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సఙ్గో స్త్వకర్మణి ॥ 47

టీ. తే=(నిత్యసత్త్వనిష్ఠుఁడును ముముక్షుఁడునగు) నీకు,కర్మణ్యేవ=నిత్యనైమిత్తికకామ్యరూప కర్మమునందే, అధికారః=అధికారము (కలదు), కదాచన=ఒకప్పుడును, ఫలేషు=వానినిసంబంధించిన ఫలములయందు-స్వర్గపశ్వాదులందనుట, మాభూత్ = (అధికారము) లేదు. †కర్మఫలహేతుః=కర్మములకును వానిఫలములకును కారణము- (కర్త); మాభూః=కాకుండుము, కర్మములకు కర్తగాననియును ఫలములకు హేతువుగాననియు అనుసంధింపుమనుట. తే=నీకు, అకర్మణి=కర్మములను అనుష్ఠింపకుండుటయందు, సఙ్గః = ఆసక్తి, మాస్తు=కలుగకుండునుగాక. 'న యోత్స్యే' అని మున్ను చెప్పినట్లు కర్మమనుష్ఠింపకుండుటయుందాసక్తి వలదనిభావము.

తా. నిత్యము నైమిత్తికము కామ్యము అనఁబడునవై ఒకానొక ఫలవిశేషముతో సంబంధించినవిగా శ్రుతులందు బ్రతిపాదింపఁబడుచున్న కర్మములలో నిత్యసత్త్వనిష్ఠుఁడునుముముక్షువునగు నీకు కర్మమాత్రమందు అధికారముకలదు;కాని దానినిసంబం

---

చారదోషము గలుగదు. ఇంతమాత్రమనఁగా కర్తృముల స్వరూపమాత్రము అని తెలియునది. అనఁగా కర్మములయొక్క ఆయాఫలములను వదలి వాని సాధారణ స్వరూపమాత్రము ఉపాదేయముగాఁ గొనవలయునని భావము. ఈఫలత్యాగముచే, ఒకఫలమునుగోరి మఱొకయుపాయమును అనుష్ఠించు దోషమును గలుగదు.

† 'కర్మణ్యేవాధికారః' 'మాతేసఙ్గో స్త్వకర్మణి' అని పూర్వోత్తరము

ంచినవిగాఁ దెలియఁబడు ఫలములందు ఒకప్పుడును అధికారము
దు. కర్మము ఫలముతోఁ గూడినదైనయెడల బంధరూప మగు
వలనను, ఫలములేక కేవలమైన కర్మము నన్ను ఆరాధించుటయే
 మోక్షహేతు వగుటవలనను, కర్మమునకును వానిఫలముల
ను హేతువుగాకుము. కర్మములను అనుష్ఠించుచుండినను ని
 సత్త్వస్థుఁడును ముముక్షుఁడునగునీవు అకర్తృత్వముగూడ
నుసంధింపవలయును. ఆఁకలి నివర్తించుట మొదలైన ఫలము

ందు కర్మములను గావింపుమని జెప్పి నడుమ 'మాకర్మఫలహేతుర్భూః' అని
ర్మములకు హేతువు-అనఁగా కర్త-గాకుండుము అనుట విరుద్ధమగుచున్నది.
కాన యిట 'హేతువుగాకుండుము' అనఁగా వాస్తవమున హేతువుగాకుండు
ని యర్థముగాదు. హేతువుగా నుండుటను అనుసంధింప వలదనిభావము. కర్మ
నకు హేతుత్వముగాదు హేతుత్వానుసంధానమే నిషేధింపఁబడినదని గ్రా
్యము. మఱియిట 'మాఫలేషు కదాచన' అని ఫలహేతుత్వమును నిషేధిం
యుండఁగా 'మాకర్మఫలహేతుర్భూః' అని మరల దానిని నిషేధించుట పున
క్తమగును. ఇది యిట్లుండ భోజనాదులవలన తృప్తివృత్త్యాదిఫలములు కలు
నుగదా. ఈఫలములను నిషేధించినచో వీని కుపాయములైన భోజనాదులందరి
క్తియు నివర్తించునుగాన శరీరధారణాదులులేక ఉపాయానుష్ఠానమే లో
ంచును. కనుక ఫలనిషేధము పొసఁగదు. | కాన యిందులకై 'తృప్తివృత్త్యాదు
ైన ఫలములకుఁగూడ' అనిచెప్పఁబడినది. అనఁగా ముందు 'ఫలేషు' అనుచో
సామాన్యముగా ఫలములనుచెప్పి యిప్పుడు 'ఫలహేతుః' అనుచో తృప్తివృ
త్త్యాది విశేషఫలములను చెప్పుటచే పునరుక్తి కలుగదు. మఱి, తృప్తివృత్త్యాది
ఫలముల స్వరూపమును నిషేధింపలేదు. ఆఫలములకు తాను హేతువని యనుసం
ధించుటమాత్రమే నిషేధింపఁబడినది గాన ఉపాయానుష్ఠానలోపము మున్నగు
దోషములు కలుగవు.

లకుఁగూడ నిన్ను హేతువుగా నీ వనుసంధింపరాదు. *ఆరెంటి గుణములందుఁ గానిసర్వేశ్వరుఁ డగునాయందుఁగాని అనుస ధింపవలయునని మీఁదఁ జెప్పఁబడెడిని. ఇట్లు అనుసంధించి కర్మ ము చేయుము. 'నేను యుద్ధముచేయను' అని నీవు మున్ను చెప్పి

---

* కర్మమునకు ఫలములకును తాను హేతువుగానుండియు హేతువుగాఁ యనుసంధించుట యెట్లు? అహేతుకమైనదానికి ఉపాయ మనుష్ఠింప నేల? మ ప్రయాసమెందుకు? అన్నచో కర్మమునకును ఫలమునకును హేతువు గుణముల కాని సర్వేశ్వరుఁడనికాని యనుసంధింపవలయునని మీఁదఁ జెప్పఁబడుచున్న కాఁబట్టి యహేతుకత్వము లేదు. కాని,ఆ ల్పమాత్రము అందులకు హేతువుగ దని యనుసంధించుటచే అది దానిని అనుష్ఠింపలేదని ప్రసక్తికలుగదా?యనవచ్చు ను. అయినను ఇచట అనుష్ఠించుటను అనుష్ఠింపమిగా భ్రాంతి చెప్పలేదు.అను ష్ఠించినవాఁడైయుండఁగా అట్టివాఁడు గాఁడని గ్రహించునట్లును విధింపలేదు. రాత్తు తచ్ఛ్రుతేః' 'య ఆత్మానమన్తరో యమయతి' 'సర్వస్యచాహం హృ న్నివిష్టః' ఇత్యాదిశారీరక సూత్ర శ్రుతి స్మృతులవలన ఆత్మయొక్క కర్తృత్వ ము పరమాత్మ కధీనమైనదని తెలియుచున్నది. మఱియు ఆత్మకుఁగల కొన్ని కార్యములు త్రిగుణములచేఁ గలిగినవికాని దానికి స్వరూపముచే సిద్ధించిన గావు. ఇట్లు ఆత్మచేయుకార్యమునకు పరమాత్మాదులు హేతువులు పెక్కులు డఁగా ఆత్మయొక్కటే హేతువనుటయు,త్రిగుణములచే దానికిఁ గలిగినవాని స్వరూపముచేఁ గలిగినవనుటయు,భ్రాంతి సిద్ధములుగాన యారెంటిని ఇటనిషే ధించి గుణములును సర్వేశ్వరుఁడును ఆత్మకార్యమునకు హేతువులుగా అనుస ధించుట చెప్పఁబడినది. ఇట్లు ఆత్మకు కర్మఫలముల హేతుత్వానుసంధానము నిషేధించినను వానియొక్కస్వరూపమును నిషేధింపరాదుగాన 'ఇట్లు అనుస ధించి కర్మమునుజేయుము' అని అనుష్ఠింపకుండుటయందు తగులువలదని చెప్పి ఈయనుష్ఠింపమికి 'నయోత్స్యే' అన్న యర్జునినితోంటికార్యము నే యుద హరించిరని తెలియునది.

ట్లు కర్మమును అనుష్ఠింపకుండుటయందు నీకు సంగము లేకుం డుఁగాక-అనఁగా పూర్వోక్తప్రకారమున యుద్ధాదికర్మమునం దే సంగ ముండుఁగాక యనియర్థము.

అవ. దీనినే మఱింత స్ఫుటముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

టీ. హే ధనఞ్జయ=ఓయర్జునా, సఙ్గం=రాజ్యబంధుప్రభృతుల యందు ఆసక్తిని,త్యక్త్వా=విడిచి,యోగస్థస్సన్=యోగమునందు-అనఁగా సిద్ధ్యసిద్ధులయందు-(సమత్వబుద్ధియందు) ఉన్నవాఁడవై, కర్మాణి=యుద్ధాదికర్మములను,కురు=చేయుము.సిద్ధ్యసిద్ధ్యోః=(ఆకర్మములలోఁ జేరియుండు జయము మొదలగువాని) ప్రాప్తియం దును అప్రాప్తియందును, సమః=సమానుఁడవు, భూత్వా=అయి, (కురు=చేయుము), సమత్వం=సిద్ధ్యసిద్ధులయందు ఏకరూపమగు మనస్సుగలిగియుండుటయే, యోగః (ఇతి) ఉచ్యతే=యోగమని చెప్పఁబడుచున్నది.

తా. రాజ్యబంధుప్రభృతులయందు సంగమును వదలి,సిద్ధ్యసిద్ధులను సమముగాఁ గొనుయోగమునందు నిలిచి, యుద్ధాదికర్మముల నాచరింపుము. వానియం దంతర్భూతములైన ఫలములగు జయము మొదలైనవి సిద్ధించినను సిద్ధింపకుండినను సమానమగుమనస్సు గలిగి యాకర్మములను జేయుము. సిద్ధ్యసిద్ధులయందలి యీసమత్వము 'యోగస్థః' అని యిట యోగశబ్దముచే చెప్పఁబడినది. ఇట్లు (యోగశబ్దమునకు సిద్ధ్యసిద్ధిసామ్యము అని అర్థమెట్లు? అనరాదు.'యోగశ్చిత్తవృత్తినిరోధః' అని యోగానుశాసనమునచిత్తసమాధానమని యర్థము.ఇట) సిద్ధ్యసిద్ధులయందు సమ

త్వరూపమైన చిత్తసమాధానమే యోగమనఁబడును.

అవ. ఎందు కిది మాటిమాటికిఁ జెప్పఁబడుచున్న దనఁగా చెప్పుచున్నాఁడు.

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ 49

టీ. హే ధనఞ్జయ=అర్జునా, బుద్ధియోగాత్ =బుద్ధియోగము కంటె-అనఁగా బుద్ధియోగముతోఁగూడిన కర్మమునకంటె,(ఇతరత్ =అన్యమైన,) కర్మ=కామ్యకర్మము, దూరేణ=మిక్కిలి, అవరంహి=తక్కువగదా, బుద్ధౌ=సమత్వబుద్ధియందు,శరణం=ఆశ్రయమును, అన్విచ్ఛ=కోరుము. ఆబుద్ధియందే వర్తింపుమనుట, ఫలహేతవః = ఫలాపేక్షతో కర్మములఁ జేయువారు, కృపణాః దీనులు-సంసారులగుదురని భావము.

తా. (ప్రధానఫలమును ద్యజించినదై, అవాంతరఫలముల సిద్ధ్యసిద్ధులయందు సమమై యుండుబుద్ధియోగముతో చేయఁబడుకర్మముకంటె ఇతరమైనకామ్యకర్మము మిక్కిలి నికృష్టమయినది. పూర్వోక్తబుద్ధియోగముతోఁగూడిన కర్మము నిఖిలసాంసారికదుఃఖములను దొలఁగించి పరమపురుషార్థ లక్షణమగు మోక్షమును బొందించును. ఇతరమైనది అపరిమిత దుఃఖరూప వగుసంసారమును బొందించును. కాన రెంటికిని ఎక్కువతక్కువలంబట్టి వైరూప్యము మిక్కిలిగానున్నది. కనుకకర్మముల నాచరించునపుడు అట్టిబుద్ధియందు వర్తింపుము. ఫలాపేక్షతో కర్మములనాచరించువారు దీను లయిననిత్యసంసారు లగుదురు.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్

టీ. బుద్ధియుక్తః=బుద్ధియోగముతోఁ గూడినవాఁడు, ఇహ=ఈ లోకమునందు, సుకృతదుష్కృతే = పుణ్యపాపములను, ఉభే= రెంటిని, జహాతి=త్యజించుచున్నాఁడు, తస్మాత్ = ఆ కారణమువలన, యోగాయ=సమత్వరూపమైన బుద్ధియోగముకొఱకు, యుజ్యస్వ= ప్రయత్నపడుము, కర్మసు=కర్మములయందు - కర్మములాచరించునపుడనుట- యోగః=బుద్ధియోగము, కౌశలం=సామర్థ్యము-సామర్థ్య సాధింపఁదగిన దనుట.

తా. బుద్ధియోగముతో కర్మముల నాచరించువాఁడు అనాది కాలసంచితములును అనంతములును బంధహేతువులు నైన పుణ్య పాపములను రెంటిని ఇహమునందు త్యజించును. కాఁబట్టి సమత్వరూపమైన అట్టిబుద్ధి యోగముకొఱకు నుద్యోగింపుము. బుద్ధియోగముతో కర్మములు చేయుటయే మిక్కిలి సామర్థ్యము. కాఁబట్టి సమత్వబుద్ధియుక్తుఁడవు గమ్ము.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్. 51

టీ. బుద్ధియుక్తాః=బుద్ధియోగముతోఁ గూడిన, మనీషిణః= వివేజ్ఞులు, కర్మజం=కర్మమువలనఁ గలుగు, ఫలం=ఫలమును, త్యక్త్వా=విడిచి, జన్మబన్ధవినిర్ముక్తాః సన్తః=జన్మమనెడి బంధమునుండి విడువఁబడినవా రగుచు, అనామయం = ఉపద్రవరహితమగు, పదం=స్థానమును, గచ్ఛన్తిహి=పొందుచున్నారు గదా.

తా. బుద్ధియోగముతో కర్మముల నాచరించుజ్ఞానులు కర్మములవలనఁ గలుగుసాంసారికఫలములు నుజ్జగించి, పునర్జన్మమనెడి బంధమునుండి విడువడినవారై నిరుపద్రవమైన మోక్షపదవి నొందుదురు. ఇది ప్రసిద్ధమే కదా.

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥ 52

టీ. తే=నీయొక్క, బుద్ధిః=బుద్ధి, మోహకలిలం=అజ్ఞానరూపమగుకలుషమును, యదా=ఎప్పుడు, వ్యతితరిష్యతి=దాటఁగలదో, తదా=అప్పుడు, శ్రోతవ్యస్య(కృతే) = విననలసిన యర్థముకొఱకును, శ్రుతస్యచ (కృతే)=వినిన యర్థముకొఱకును, *నిర్వేదం=నిన్ను నీవే నిరసించుకొనుటను, గన్తాసి=పొందఁగలవు.

తా. (ఇట్లు చెప్పఁబడిన ప్రకారమున కర్మమునందు వర్తించుచున్నవాఁడవై అట్టివర్తనముచేఁ పాపములు పోఁగొట్టుకొన్నవాఁడవగు) నీయొక్క బుద్ధి (ఇంకను అత్యల్పఫలసంగమునకు హేతుభూతమైయుండు) మోహరూపకలుషమును ఎప్పుడు దాఁటునో అప్పుడు ఆప్తతములగు మాబోఁటులవలన నింతకుఁబూర్వము త్యాజ్యములుగా నీవు వినినఫలాదులకుఁగానును ఇఁక వినఁబోవు వానికిఁగానును నిన్ను నీవే నిరసించుకొనఁగలవు.

అవ. 'యోగేత్విమాం శృణు' ఇత్యాదులచేఁ జెప్పబడినదియు ఆత్మయాథాత్మ్యజ్ఞానపూర్వకమైనదియు బుద్ధివిశేషముచే సంస్కరింపఁబడినదియు నగు ధర్మానుష్ఠానమునకు ఉద్దేశ్యభూతమగు యోగ మనెడిఫలమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి॥ 5

* నిర్వేదమనఁగా నిన్ను తాను నిరసించుకొనుట. 'ఆప్తతములైనవా రెం చెప్పినను వినక త్యాజ్యములైన వానియందు మున్ను సంగముకలిగియు ఉపా యములైన వానిని ఇంకను తెలిసికొనకయు నేనున్నాఁడనే' యని నిర్వేదపడు ఇటన్తాత్పర్యము.

టీ. శ్రుతివిప్రతిపన్నా = వినుటచేత విశేషముగా తెలిసికొ బడినదై - అనగా సకలవిలక్షణనిత్యాత్మస్వరూపమును దెలిసి నట్టి విశేషముగలదై, అచలా = తనంతట ఏకరూపమయిన, =నీయొక్క, బుద్ధిః=బుద్ధి, సమాధౌ=మనస్సునందు, యదా=ఎ ప్పుడు, నిశ్చలా=చలింపనిదై, స్థాస్యతి=నిలుచునో, తదా = అప్పు డు, యోగం=ఆత్మావలోకనమును, అవాప్స్యసి=పొందఁగలవు,

తా. ఆ వ్రతము లగుమావలనఁగలిగినవినికిచేత విశేషము గ్రహింపఁబడినదియు, (ఇతరములగు సకలవస్తువులకును విజా తీయమును సజాతీయమునుగాక నిత్యమై నిరతిశయసూక్ష్మతత్త్వ మైయుండునట్టి ఆత్మ విషయముగాఁగలదియు, కాఁబట్టి 'వ్యవసా యాత్మికాబుద్ధిరేకా' అనునట్లు తనంతట) చలింపక ఏకరూప ముగా నుండునదియునగు నీబుద్ధి, ఫలసంగములేని కర్మానుష్ఠాన ముచేత నిర్మలముగాఁ జేయఁబడిన నీమనస్సునందు ఎప్పుడు నిలు వ గలదియగునో, అపుడు నీవు యోగమును (అనఁగా ఆత్మావ లోకనమును) బొందుదువు. దీని అభిప్రాయమేమనిన-*శాస్త్రజ న్యమయిన ఆత్మజ్ఞానమును మున్నిడుకొని చేయఁబడు కర్మయో

* మొదట శాస్త్రశ్రవణముచేత తత్త్వజ్ఞానము (అనగా ఆత్మయొక్క నిజ స్వరూప మిట్టిది యను నెఱుక) కలుగుచున్నది. ఇదియె ఆత్మజ్ఞానము అనియు చె ప్పఁబడుచున్నది. పిదప రెండవది స్మృతిసంతతిరూపమగు ఉపాసనము-స్మృతి సంతతి యనఁగా ఎడతెగని స్మరణము-తైలధారవలె అవిచ్ఛిన్నముగా ఆత్మను స్మరించుచుండుట. ఈస్మృతిసంతతిరూపమైన యుపాసనమునకే స్థితప్రజ్ఞత, ధ్యాననిష్ఠ, జ్ఞానయోగము అని మూఁడుపేళ్లు వ్యవహరింపఁబడుచున్నవి. పిదప మూఁడవది ఈయుపాసనమూలమునఁ గలుగు ఆత్మసాక్షాత్కారము. అనఁగా ఆత్మదర్శనము. దీనికే యోగము అనియు పేరు. ఈమూఁడును జ్ఞానపూర్వ రూపములని యెఱుంగునది.

గము స్థితప్రజ్ఞత యనెడి జ్ఞాననిష్ఠను గలుగఁజేయును. ఆస్థితప్ర
జ్ఞత యోగమనెడిఆత్మావలోకనమును సాధించుననిభావము.

అర్జున ఉవాచ.

అవ. ఇట్లు చెప్పఁగా, అర్జునుఁడు ఫలసంగరహితకర్మానుష్ఠా
నరూప మైనకర్మయోగముచే సాధ్యమైనదియు యోగమునకు
సాధనమైనదియు నగు స్థితప్రజ్ఞతయొక్క స్వరూపమున స్థితప్ర
జ్ఞుని అనుష్ఠానప్రకారమును నడుగుచున్నాఁడు.

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥ 5

టీ. కేశవ=కృష్ణా, సమాధిస్థస్య=సమాధి(అనఁగా మనస్సున
వశపఱుచుకొనినస్థితి) యందుండెడి, స్థితప్రజ్ఞస్య=జ్ఞాననిష్ఠునికి
భాషా = వాచకశబ్దము, కా = ఏది-అనఁగా మఱియు నేశ
ముచేత వానిని నిర్దేశింపవచ్చును-వానిస్వరూపమెట్టిదియని
రము, స్థితధీః = ఆస్థితప్రజ్ఞుఁడు,కిం= దేనిని, ప్రభాషేత =పలు
ను, కింఆసీత = (ధ్యానముకొఱకు) ఎట్లు కూర్చుండును, కింవ్ర
త=ఎట్లు నడచును-వానినడత యెట్టిది.

తా. సమాధినిష్ఠుఁడై స్థితప్రజ్ఞత గలపురుషుని* స్వరూ
మెట్టిది? అతఁ డెవ్విధమునఁ బలుకుచుండును? ఎట్లు కూర్చుం
ను? ఏమిటఁ బ్రవర్తించును?

శ్రీభగవానువాచ.

అవ. స్థితప్రజ్ఞతయొక్క పరిపాకమునకుఁ గలనాలుగుదశ

* దేనియొక్క స్వరూపముగాని దానియొక్క వాచకశబ్దముచేత
శింపఁబడుచున్నది గనుక నిందు స్థితప్రజ్ఞునికి వాచకమగుశబ్దమేది యనుట
వానిస్వరూప మెట్టిది అనునర్థము ఫలించుచున్నదని గ్రాహ్యము.

రాఁ గల నాలుగు శ్లోకములందు వరుసగా నిరూపింపఁబడుచున్నవి. అందు పూర్ణ పరిపక్వ మగు నాలుగవదశ వశీకారసంజ్ఞ అను పేరు గలది మీఁది శ్లోకమునఁ జెప్పఁబడుచున్నది. మఱియు స్థితప్రజ్ఞుని స్వరూప మెట్టిది? యను మొదటి ప్రశ్నమునకు నుత్తరముగా, వానిప్రవృత్తివిశేషమును జెప్పిన యెడల వానిస్వరూపముకూడఁ జెప్పఁబడినదే యగును గనుక వానిప్రవృత్తివిశేషమును జెప్పుచున్నాఁడు,

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥ 55

టీ. హే పార్థ=అర్జునా, ఆత్మన్యేవ=ఆత్మయొక్కటియందె-ఆత్మనే యవలంబించినట్టి, ఆత్మనా=మనస్సుచేత, తుష్టః=సంతోషించినవాఁడై, మనోగతాన్=మనస్సునందుండెడి, సర్వాన్=సమస్తమైన, కామాన్=తుచ్ఛమైనకోరికలను, యదా=ఎప్పుడు, ప్రజహాతి=మిక్కిలి విడుచుచున్నాఁడో, తదా=అప్పుడు, స్థితప్రజ్ఞః=స్థితప్రజ్ఞతగలవాఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా. అర్జునా, * ఎప్పుడును ఆత్మయే విషయముగాఁ గలిగి యుండు మనస్సుచేత నాయాత్మయందే తృప్తినొందినవాఁడై (అనఁగా ఆత్మయందే సంతోషించినమనస్సుగలవాఁడై) యాతృప్తిచేత ఆత్మతప్ప తక్కినకోర్కెలన్నియు బొత్తిగా నెప్పుడు వదలుచున్నాఁడో అప్పుడు స్థితప్రజ్ఞుఁడనఁబడుచున్నాఁడు. ఇదియే జ్ఞాననిష్ఠయొక్క కాష్ఠ-అనఁగా స్థితప్రజ్ఞతయొక్క పూర్ణపరిపాకదశ.

---

* నిరతిశయానందరూపమగు నాత్మయే యుద్దేశ్యముగాఁ గలిగి దానియందె రమించుచుండు మనస్సుగలవానికిఁ దక్కిన యాయాపదార్థములందుఁ గలయా యాకోరికలన్నియు మఱల మొలకెత్తకుండునట్లు సవాసనముగ పూర్ణముగ నశించుచున్నవని భావము.

అవ. ఈనాలుగవదశకంటె కొంచెముతక్కువ పరిపాకముగల * మూఁడవదశను ఏకేంద్రియసంజ్ఞ అనుదానిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే ॥ 56

టీ. దుఃఖేషు=దుఃఖహేతువులగువానియందు, అనుద్విగ్నమనాః = క్షోభమునొందనిమనస్సుగలవాఁడును, సుఖేషు = సుఖహేతువులగువానియందు, విగతస్పృహః=స్పృహలేనివాఁడును, వీతరాగభయక్రోధః=ఆశ భయము క్రోధము లేనివాఁడును అగు, మునిః=ఆత్మమననశీలుఁడు,స్థితధీఃఇతి=స్థితప్రజ్ఞుఁడని,ఉచ్యతే= చెప్పఁబడుచున్నాఁడు.

తా. † ప్రియవిరహాదిదుఃఖములకు నిమిత్తములైనట్టివి ప్రాప్తించి దుఃఖమును పుట్టింపగా వానివలన దుఃఖింపనివాఁడును, ప్రియులగువారు దగ్గఱనుండినను వారియెడల పూర్వ మిుండిన స్పృహలేనివాఁడును, రాగభయక్రోధములు లేనివాఁడును, ఆత్మమననశీలుఁడును నగువాఁడు స్థితప్రజ్ఞుఁడనఁబడుచున్నాఁడు. ఉద్వేగస్పృహారాగాదులు లేనివాఁడై సాక్షాత్కరింపఁబోవుచున్న యాత్మను మననము చేయుచునుండువాఁడు స్థితప్రజ్ఞుఁడని భావము. స్పృహ యనఁగా సామాన్యముగా అనురాగము. రా

* ఉద్వేగస్పృహారాగాదులు నాలుగవదశకును మూఁడవదశకును సమానమేయైనను, ఈమూఁడవదశయందు ఔత్సుక్యమాత్రమును చూపఁజాలువిషయవాసన బూడిదలోనినిప్పువలె నొక్కింత మిగిలియుండుటచే ఇది నాల్గవదశకంటెను వేఱగుచున్నది.

† ప్రియవిశ్లేషాదులు ప్రాప్తించి బాధపెట్టునపుడు కలుగునది దుఃఖము. అవి ప్రాప్తించునని కేవలసూచకములగపడినపుడు కలుగు దుఃఖము భయము.

(మనఁగా కలుగనట్టివానియెడల స్పృహ. ప్రియములైనవి పాసిపోవుటకును. అప్రియములైనవి వచ్చుటకును సూచకములైన హేతువులను జూడఁగాఁ బుట్టునట్టిదుఃఖమే భయము. ప్రియములపోకకును అప్రియములరాకకును హేతుభూతులైన యితరచేతనులకు దుఃఖముకలిగించునట్టి తనమనోవికారమే క్రోధము.

అవ. మూఁడవదశకన్న కొంతతక్కువ పరిపాకముగల రెండవ దశను *వ్యతిరేకసంజ్ఞ అను పేరుగలదానిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

టీ. యః=ఎవ్వఁడు, సర్వత్ర=అన్నిట-ప్రియములైనవానియందెల్ల, అనభిస్నేహస్సన్=స్నేహములేనివాఁడగుచు-తన్ను అనుబంధించియుండువారియెడల స్నేహము చూపక ఉదాసీనుఁడుగానుండుచుననుట, తత్తత్ శుభాశుభం=ఆయాశుభాశుభములను, ప్రాప్య=దైవికముగా పొందియు, నాభినన్దతి=సంతోషింపఁడో, న ద్వే

* అపక్వములైన కషాయములను పక్వములైనవానికంటె వేఱుయినవిగా తలఁచి వానినిగూడఁ బక్వతను పొందించు దశయే వ్యతిరేకసంజ్ఞ యనఁబడును. ఇట పూర్వమే తన్ను అంటియుండు ప్రియులయెడ తానే స్నేహము చూపఁడనియు, దైవికముగా నతనిప్రాప్తించిన ప్రియసంశ్లేషములందు అభినందనాదులను చూపఁడనియు చెప్పఁబడుటచే, అపక్వములైన రాగాదులకు పక్వము సేయఁగోరి స్నేహము, అభినందనము, ద్వేషము అనెడిమనోవ్యాపార విశేషములను వారించుచున్నాఁడనియర్థము. అనఁగా ఆరాగాదులను ఉదాసీనత్వముగాను పిదప అనభినందనముగాను అద్వేషముగాను పక్వము సేయుచున్నాఁడని భావము కాన యిది వ్యతిరేకసంజ్ఞయగుచున్నది. అనఁగా ఉదాసీనత్వాదులచే రాగద్వేషాదులను నివారించుచున్నాఁడని గ్రాహ్యము.

ష్టి=ద్వేషింపఁడో, తస్య=వానియొక్క, ప్రజ్ఞా=జ్ఞానము, ప్రతిష్ఠితా=మిక్కిలి స్థిరమైనది-అనఁగా వాఁడుగూడ స్థితప్రజ్ఞుఁడు.

తా. తన్ను సంబంధించియున్న ప్రియములగువానియందంతటను స్నేహమువదలి ఉదాసీనుఁడయి (తగులులేనివాఁడై), దైవికముగా ప్రియసంయోగరూపమగు శుభమైనను ప్రియవియోగరూపమైన యశుభమైనను గలిగినప్పుడును వాని నను మోదించుటగాని ద్వేషించుటగాని లేకయు నుండునో వాఁడును స్థితప్రజ్ఞుఁడు.

అవ. రెండవదశకన్న తక్కువపరిపాకముగల మొదటిదశను యతమానసంజ్ఞ అను పేరుగలదానిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58

టీ. యదా=ఎప్పుడు, అయం = ఇతఁడు, ఇన్ద్రియాణి = విషయములను స్పృశించుటకు ఉద్యుక్తములై యున్న ఇన్ద్రియములను, కూర్మః = తాఁబేలు, అఙ్గానీవ = అవయవములను వలె, సర్వశః=సమస్తవిధముల, ఇన్ద్రియార్థేభ్యః = విషయములనుండి, సంహరతే=మఱలించుకొనుచున్నాఁడో, (తదా=అప్పుడు), తస్య=వానియొక్క, ప్రజ్ఞా=జ్ఞానము, ప్రతిష్ఠితా=మిక్కిలి స్థిరమైనది.

తా. *ఎపు డింద్రియములు విషయములను దాఁకుటకు ను

---

*ఇచట విషయములను దాఁక నుద్యుక్తములైయుండు నపుడే ఇంద్రియములను మరల్చుటను జెప్పుటచే, వార్ధకము రోగము మొదలైన వానిచేఁగలిగిన యశక్తిచేఁగాని నిద్రాదులచేఁగాని వానిని మరల్చుటగాదని తెలియునది. మఱియు ఉద్యుక్తమై నపుడే యనుటచే, తాఁక నున్నపుడే కాని తాఁకి యనుభవించిన వెనుకఁ గాదనియు సూచితము. ఇంతేకాక కూర్మోపమానముచే తాఁబేలు తలఁచుకొన్నమాత్రమున తనయంగములను లోనికెట్లు ఈడ్చుకొనును

ర్యగించునో అపుడే, తాఁబేలు తనయవయవములను ముడిఁచి లోపలి కీడ్చుకొను తెఱఁగున, విషయములనుండి ఆయింద్రియము ను సర్వవిధముల మఱలించి మనస్సును ఆత్మయందు గట్టిగాని ుపువాఁడుగూడ స్థితప్రజ్ఞుఁడు.

ఇట్లు స్థితప్రజ్ఞత ప్రారంభము మొదలుకొని పరిపాకము అకు నాలుగుదశలు గలదిగానున్నది.* ఈనాలుగింటిలో ముందు

---

ట్లె ప్రథమదశయందుండు స్థితప్రజ్ఞుఁడును విషయములతోఁ గలిసి సిద్ధముగా న్న తనయింద్రియములను తలఁచినమాత్రమున వాని యన్నింటినుండి మరల్చు ను లాఘవము గలవాఁడై యుండునని యెఱుంగునది. ఇట్లు మరల్చుటచే లోకనశ్రవణాది బాహ్యవ్యాపారములన్నియు లేనివాఁడై వాఁడు మనస్సును గోనున్న యాత్మయందు నెలకొల్పుచున్నాఁడు.

* మొదట బాహ్యేంద్రియములను విషయములనుండి మరల్చి బాహ్యవ్యాపారములను మాని మనస్సును లోనున్న యాత్మయందు నిలుపుటకు యత్నము చేయవలయును. ఇదియె యతమానసంజ్ఞ అను మొదటి దశ. ఇట్లు ఇంద్రియములు బలాత్కారముచే మరల్పఁబడినప్పటికిని శేషించియుండు రాగద్వేషాదిదోషముల చేత కలుషితమైన మనస్సు వానినిమరల విషయములదెస నిగుడునట్లు పురికొల్పుటయేకాక తాను ఆత్మయందు నెలకొనుటకు అశక్తమగుచున్నది. కాఁబట్టి పక్వములుగాక మిగిలియున్న రాగాదులను మొదట ఉదాసీనత్వముగాను పిదప అనభినందనము మొదలైనవిగాను మాఱునట్లు పక్వము సేయవలయును; అవఁగా నవి పూర్ణముగాఁ దొలఁగునట్లు ఉదాసీనత్వము మొదలైన వానిని దాల్పవలయును-ఇదియె వ్యతిరేకసంజ్ఞ అను రెండవదశ. ఇట్లు రాగాదులు పక్వములైనను (పూర్ణముగా నశించినను,) అనాదికాలమునుండి విషయముల ననుభవించుచుండినందువలనఁ గలిగియున్న విషయవాసనమాత్రము విషయానుభవము నశించినను, దాను నశింపక ఆ విషయములయెడల ఔత్సుక్యమాత్రమును గలిగించి ఆత్మ ననుభవింపఁగోరు బుద్ధిని కలంచుచున్నది. అయినను, మొదట

చెప్పఁబడిన యొక్కొక్కదశకును దానివెనుకటిది సాధనమని యెఱుఁగునది.

అవ. ఇప్పుడు జ్ఞాననిష్ఠను పొందుట కష్టమనియు దానిని పొందు నుపాయమును జెప్పుచున్నాఁడు.

---

పురుషులను ద్వేషించునదిగానుండిన యొక యువతికి సుందరాంగుఁ డగునొక యౌవనపురుషునిఁ జూపఁగా నది వానినిజూచి పిదప వానియెడల తుష్టిగలది యెట్లగునో అట్లే, యాబుద్ధికి నిరతిశయానందరూపమగు నాత్మనుజూపి రాను రాను దానియందు మిక్కిలి తుష్టిగలుగఁజేసి యాతుష్టియొక్క పటిమచేత బాహ్యవిషయవాసనా సమూహమును అది గలుగఁజేయు ఔత్సుక్యమును నిర్మూలనముచేయఁబూనవలయును. ఇందుకు స్మరింపనలవికాని బహుదీర్ఘకాలము పట్టును. ఇట్టి స్థానికగలదియె ఏకేంద్రియసంజ్ఞ అనుమూఁడవదశ. ఇట్లు ఆత్మరతిచేత సమస్త వాసనలును నశించి తుదకు ఔత్సుక్యముమాత్రమయినను గలుగక పోఁగా పరమవైరాగ్యయుక్తమై వశీకరణసంజ్ఞ అనుపేరుగలిగిన నాలుగవదశ కలుగుచున్నది. ఇదియె స్థితప్రజ్ఞతయొక్క పూర్ణపరిపాకదశ. ఈదశయే యోగము అనెడి ఆత్మావలోకనమును సాధించుచున్నది. ఆత్మావలోకనమే పరంపరగా నిరతిశయ పురుషార్థరూపమగుమోక్షమునకు సాధన మగునని మీఁద తెలుపఁబడును. కామములు కామములుగా కనఁబడకుండుట; అట్లె కనఁబడు చుండినను వానియందు సంగములేకుండుట; సంగలేశముతో వాని ననుభవించుచుండినను అతిస్నేహము లేకుండుట; అనురాగము మిక్కిలిగా నుండినను దానిని నిరోధించుటకై తోడిఁబడుట; అని కాష్ఠాదశ మొదలుగాఁ గలనాలుగు అవస్థలకును వరుసగా వైషమ్యము తెలియునది.

54. వ శ్లోకమున స్థితప్రజ్ఞుని స్వరూపాదులను గుఱించిన నాలుగు ప్రశ్నములకు క్రమముగా ఉత్తరము లెట్లనఁగా-ఆత్మరతిశ్చ మే వానిస్వరూపము. 'ఆశ్చర్యవ ద్వదతి' అనుట్లు ఆత్మనుగుఱించిన భాషణమే వానిభాషణము. ఆత్మానుసంధానమే వానియాసనము. ఆత్మప్రాప్తికొఱకైన ప్రవృత్తియే వానివ్రజనము (నడత) అని యెఱుంగునది.

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ 59

టీ. నిరాహారస్య=ఆహారము లేని (అనఁగా ఇంద్రియములకు విషయములు ఆహారమువంటివిగనుక విషయములనెడి ఆహారము లేని-అనఁగా విషయములనుండి మరల్పఁబడిన యింద్రియములు గల), దేహినః=పురుషునికి, విషయాః=శబ్దాదివిషయములు, రసవర్జం=విషయరాగముతప్ప,వినివర్తన్తే=నివర్తించుచున్నవి,రసోఽపి=రాగముఁగూడ, పరం=విషయములకంటె సుఖతరమగు ఆత్మస్వరూపమును, దృష్ట్వా = చూచినపిదప, అస్య=వీనికి, నివర్తతే= నివర్తించుచున్నది- అనఁగా ఆత్మదర్శనము లేక విషయరాగము నివర్తింపఁదని గ్రాహ్యము.

తా. ఇంద్రియములను విషయములనుండి మరల్చుకొన్న పురుషునకు విషయానుభవము నివర్తించినను,విషయములయందలి రాగముమాత్రము వదలదు. సుఖరూపము లైనవిషయములకంటె సుఖతర మగుఆత్మస్వరూపమును గనుఁగొన్నపిదప,ఆవిషయరాగముగూడ నివర్తించును. (అనఁగా, విషయానుభవము నివర్తించినను విషయరాగముమాత్రము ఆత్మదర్శనమగువఱకు నివర్తింపదు. అది ఆత్మదర్శనమైననే నివర్తించునని భావము.)

అవ. ఆత్మదర్శనము కలుగక విషయరాగము నివర్తింపదు. విషయరాగము నివర్తింపకున్న ఇంద్రియములను జయించుట కష్ట మనుచున్నాఁడు.

శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥ 60

టీ. హేకౌన్తేయ=ఓఅర్జునా, విపశ్చితః = జ్ఞానవంతుఁడును,

యతతః=(ఇంద్రియనిగ్రహముకొఱకు) ప్రయత్నముచేయుచున్న వాఁడునగు, పురుషస్యాపి=పురుషునియొక్కయు, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, ప్రమాథీని = కలఁచునట్టివి-బలవంతములైనవి, మనః=మనస్సును, ప్రసభం=బలాత్కారముగా, హరన్తిహి=ఆకర్షించుచున్నవిగదా.

తా. ఆత్మదర్శనము లేక విషయరాగము నివర్తింపదు. విషయరాగము నివర్తింపకుండునపుడు విద్వాంసుఁడైనపురుషుఁడు ఇంద్రియజయాదులకొఱకు ఎంతప్రయత్నము చేయుచుండినను, వాని విషయరాగమే ఇంద్రియములకు బలము కావున దానిచే బలవంతములైన యింద్రియములు వానిమనస్సును మిక్కిలి కలంచుచు దానిని ఆత్మయందు నెలకొననీయక బలాత్కారముగా లాగుచున్నవి; కాన ఆత్మదర్శనము లేకపోవుచున్నది. ఇట్లు ఇంద్రియజయము ఆత్మదర్శనముచేతనే కలుగునదై యున్నది. ఆత్మదర్శనము ఇంద్రియజయముచేతనే కలుగునదై యున్నది. ఈ అన్యోన్యాశ్రయణమువలన జ్ఞాననిష్ఠను పొందుట కష్టమగుచున్నది.

అవ. విషయరాగమువలన ఇంద్రియములు బలవంతములై మనస్సును మిక్కిలి కలఁచుచు దానికాత్మదర్శనము కలుగనట్లు చేయుచున్నవి. కావున ఇంద్రియములను జయించిననే ఆత్మదర్శనము కలుగును. మఱియు, ఇంద్రియజయముకొఱకు ఆయింద్రియములకు బలముకలుగఁజేయు విషయరాగము నివర్తింపవలయును. విషయరాగమో 'రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే' అనునట్లు ఆత్మదర్శనముచేతనే నివర్తించును. ఇట్లు ఆత్మదర్శనముచేత రాగనివృత్తియు దానిచే ఇంద్రియజయమునుకలుగుచున్నది. అనఁగా

త్మదర్శనముచే ఇంద్రియజయముకలుగునని యేర్పడుచున్నది. ందు ఇంద్రియజయముచే ఆత్మదర్శనము కలుగునని చెప్పఁబను. ఇప్పుడు ఆత్మదర్శనముచే! ఇంద్రియజయము కలుగునని ప్పఁబడినది. ఇట్లు రెండును ఒకటినొకటి యాశ్రయించి యుంటచే ఒకటిలేక మఱియొకటి కలుగఁజాలదు. రెండును ఏకకామున కలుగనేరదు. ఇట్లీరెంటియొక్క అన్యోన్యాశ్రయణమువల వీనిచే జ్ఞాననిష్ఠ కలుగుట కష్టముకాఁగా దానిని పొందుటకు ాకసులభోపాయమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశేహి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 61

టీ. తాని సర్వాణి = వానినన్నిటిని (సకలేంద్రియములను), ంయమ్య = వశపఱుచుకొని, యుక్తః = సమాధి గలవాఁడును, త్పరస్సన్=నాయందు దాసక్తమైనమనస్సుగలవాఁడునగుచు, ఆసీ = ఉండవలయును, యస్య=ఎవ్వనియొక్క, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, వశే=తనవశమునందు, (వర్తన్తే=ఉన్నవో), తస్య = నియొక్క, పజ్ఞా=జ్ఞానము, ప్రతిష్ఠితా=మిక్కిలిస్థిరమయినది.

తా. ఆయింద్రియములనన్నిటిని విషయస్పర్శము లేకుండునట్లు ంచి,మనస్సునునాయందు నిలిపి సమాహితుఁడుకావలయును. మనస్సు నాయందుంపఁబడుటచే నిర్మలము గావింపఁబడినదై త్మదర్శనము లేకయే యింద్రియములను జయించును. అట్టిమన చేత) ఎవఁడు ఇంద్రియములను వశముచేసికొనునో వాఁడే త ప్రజ్ఞుఁడు.

స్థితప్రజ్ఞతకు ఇంద్రియజయము కావలయును. ఇంద్రియ యము ఆత్మదర్శనములేక ప్రత్యేకముగా కలుగదు. మఱి అన్యో

న్యాశ్రయాదిదోషములును కలుగుచున్నవి. ఈ దోషములనెల్ల పరిహరించుటకును, ఇంద్రియజయము ప్రత్యేకముగా కలుగుటకును ఉపాయమేమన :—విషయరాగముతోఁ గూడినవగుటచే జయింపరానివగునింద్రియములనెల్ల ఆత్మదర్శనములేమినిబట్టి పూర్ణముగా జయింపకపోయినను, వానిని విషయస్పర్శము మానునంతవఱకైనను అణఁచి, విషయములపట్టునుండి మనస్సును కొంతవిడిపించి, దానిని చేతస్సునకు శుభాశ్రయభూతుఁడగు నాయందు నిలిపి లయించునట్లు చేయవలెను. మనస్సును నాయందు నిలుపఁగా * 'యథాగ్ని రుద్ధతశిఖః కక్షం దహతి సానిలః। తథా చిత్తస్థితో విష్ణు ర్యోగినాం సర్వకిల్బిషమ్॥' (అనఁగా, గాలితోఁ గూడి పేర్చినజ్వాలలు గలిగియుండునగ్ని యెండినగడ్డిని నెట్లు కాల్చునో అట్లే యోగులహృదయమునందు నెలకొనియుండువిష్ణువు వారియొక్క సకలపాపములనుగాల్చివైచును') అనునట్లు, ఆమనస్సు, పుటమునందుఁ బెట్టినబంగారమువలె, దోషములెల్లఁ దగ్ధములగుటచే నిర్మలముగాఁ జేయబడినదై, విషయరాగముతోలగుటంబట్టి, తాను ఆత్మదర్శనము లేకయే యింద్రియములను వశము చేసికొనును. అంత 'వశేహియస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా' అన్నట్లు ఇంద్రియములను వశము జేసికొన్న మనస్సు ఆత్మదర్శనమునకు శక్తిగలదగును. ఈయుపాయముచేత ఆత్మదర్శనములేకయే ప్రత్యేకముగా నింద్రియజయము గలుగుటవలన అన్యోన్యాశ్రయణదోషము లేకపోవును. ఆయింద్రియజయముచేత స్థితప్రజ్ఞతయు సిద్ధించునని తెలియునది.

---

* విష్ణుపు. ౬.౭-౭౪; గారుడపురాణం. పూర్వ. ౨౨౨-౧౬.

అవ. మనస్సును నాయం దుంపక స్వప్రయత్నాధిక్యముచే నే ఇంద్రియజయము గావింపఁగోరువాఁడు మిక్కిలిచెడిపోవునని ప్పుచున్నాఁడు.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥63॥

టీ. విషయాన్=విషయములను, ధ్యాయతః=చింతించుచున్న, పుంసః=పురుషునకు, తేషు=ఆవిషయములయందు, సఙ్గః=సంగము, ఉపజాయతే=అధికముగా కలుగుచున్నది, సఙ్గాత్=విషయసంగమువలన, కామః=కామము, సఞ్జాయతే=పుట్టుచున్నది. కామాత్=కామమువలన, క్రోధః=కోపము, అభిజాయతే=పుట్టుచున్నది. క్రోధాత్=కోపమువలన, సమ్మోహః=అవివేకము, భవతి=కలుగుచున్నది. సమ్మోహాత్=అవివేకమువలన, స్మృతివిభ్రమః=మఱపు, (భవతి=కలుగుచున్నది), స్మృతిభ్రంశాత్=మఱపువలన, బుద్ధినాశః=ఆత్మజ్ఞానమును గుఱించిన వ్యవసాయము నశించుట, (భవతి=కలుగుచున్నది), బుద్ధినాశాత్ = అవ్యవసాయము చెడుటవలన, ప్రణశ్యతి=నశించుచున్నాఁడు.

తా. (విషయరాగమును నిరసింపకయు, దానిని నిరసించుకొఱకు మనస్సును నాయందు నుంపకయు, నుండుపురుషుఁడు స్వప్రయత్నముచేత నింద్రియముల నెంత యడంచి యుండినను అనాదిపాపవాసనచేత విషయధ్యానము వానికి తప్పక కలిగి యుండును). ఇట్లు విషయములను ఇంద్రియములచేత స్పృశింపకుండినను మనస్సుచేతమాత్రము ధ్యానించుచుండుపురుషునికి

పూర్వము వదలినవిషయసంగము మరల మిక్కిలి అధికముగా కలుగును. ఆసంగమువలన కామ ముదయించును. కామమనఁగా *సంగముయొక్క విపాకదశ, పురుషుఁడు ఏదశనుబొందఁగా విషయములను అనుభవింపక యుండఁజాలఁడో యది కామము. కామము వర్తించుచుండునపుడు దానికి విషయమైనది సన్నిహితము కానిచో సన్నిహితులైన పురుషులను జూచి 'వీరిచేత నాయిష్టము గొట్టువడినది' అని కోపము పుట్టును. కోపమువలన సమ్మోహము పుట్టును. సమ్మోహమనఁగా నిది చేయఁదగినది యిది చేయఁదగనిది యనువివేకము లేమి. అట్టివివేకము లేమిచే అన్నియు

---

* సంగమునకును కామమునకును భేదములేదు; రెండు నొకటియే. కనుక 'సంగాత్సంజాయతే కామః' అన్నట్లు ఒకటినుండి మఱొకటి పుట్టుట యెట్లు? అని శంకరాఁగా కామమనఁగా సంగముయొక్క విపాకదశ అని చెప్పిరి. అనఁగా సంగము ఒకానొక పరిపాకమును జెంది కామమగుచున్నదనియర్థము. ఇట్లు దానిని 'సంగముయొక్క విపాకదశ' అని సామాన్యముగా చెప్పటచే దాని విశేషాకారము తేటపడనందున 'ఏదశయందు .. అది కామము' అని విశదీకరించిరి. మఱియు కామము సర్వదా క్రోధమునకు హేతువు గానేరదు. అది తనకువిషయమైనది సన్నిహితము కానపుడే కోపమును బుట్టించును. కాన 'విషయమైనది సన్నిహితము కానపుడు' అనఁబడినది. కోపము కామమునకుఁ బ్రతిబంధకభూతులైన పురుషులనుగూర్చిమాత్రమే కలుగునది కాదు; అప్పుడు కృత్యాకృత్యములు తెలియకుండును గాన ఎదురుపడ్డ వారినందఱినిగూర్చియు కలుగునది. కావుననే 'సన్నిహితులైనవారిని' అనఁబడినది. క్రోధమువలన సమ్మోహము కలుగుటచే దానివలన నిది యుక్తము అది అయుక్తమని చూడక అన్నియును జేయును గావుననే ఆత్మదర్శనార్థము తాను ఆరంభించియుండు ఇంద్రియజయాద్యుపాయములను మఱచిపోవును. ఉపాయములనుమఱచిపోఁగా ఆత్మజ్ఞానముకొఱకు వానిని అనుష్ఠింపవలయునను బుద్ధి(అనఁగా నిశ్చయము) నశించునని భావము

ం జేయును. మఱియు దానివలన ఆరంభింపఁబడినయింద్రియజయ
ము మొదలగుయత్నములందు మఱపు పుట్టును. మఱపువలన
త్మజ్ఞానార్థము చేయఁబడినవ్యవసాయము చెడును. దానివలన
పజల సంసారమున మునిఁగి నశించును.

శ్లో॥ రాగద్వేషవియుక్తై స్తు విషయా నిన్ద్రియై శ్చరన్।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥ 64

టీ. రాగద్వేషవియుక్తైః=రాగద్వేషరహితములయినవియు,
త్మవశ్యైః=తనకు స్వాధీనము లయినవియు నగు, ఇన్ద్రియైః =
ంద్రియములచేత, విషయాన్=విషయములను, చరన్ = తిర
స్కరించి వర్తించుచున్న, విధేయాత్మా = స్వాధీనమగు మనస్సు
లవాఁడు, ప్రసాదం=మనోనిర్మలత్వమును, అధిగచ్ఛతి = పొం
దుచున్నాఁడు.

తా. (ముందు చెప్పఁబడినప్రకారమున సర్వేశ్వరుఁడును చిత్త
మునకు శుభాశ్రయభూతుఁడు నగునాయందు తనమనస్సునుంచి,
అట్లుంచుటచే సకలపాపములును దహింపఁబడఁగా పాపవా
సనామూలములగు) రాగద్వేషములు వీడినవియు అట్లు వీడుటచేఁ
తనకు వశములైనవియునగు తనయింద్రియములచేత విషయము
లను దిరస్కరించి వర్తించువాఁడు మనస్సును వశపఱచుకొని ప్ర
సన్నతను బొందుచున్నాఁడు. (అనఁగా నిర్మలాంతఃకరణము గల
వాఁ డగును.)

ఇట్లు రాగద్వేషవియోగముచే ఇంద్రియజయమును, ఇంద్రి
యజయముచే మనోజయమును, మనోజయముచే నాత్మదర్శనము
నకు వలయు మనోనైర్మల్యమును గలుగుచున్నదని గ్రాహ్యము.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హాని ర స్యోపజాయతే।

ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥ 65

టీ. హి=ఎందుచేత, ప్రసన్నచేతసః - ప్రసన్న=ఆత్మావలోకమునకు విరుద్ధములైన దోషములుపోయి తేటపడినట్టి, మనసః=మనస్సుగలవానియొక్క, బుద్ధిః=శుద్ధాత్మవిషయమైనబుద్ధి, ఆశు=శీఘ్రముగా, పర్యవతిష్ఠతి=స్థిరముగా నిలుచుచున్నదో, (అందువలన,) ప్రసాదేసతి=మనస్సునకు నిర్మలత్వము కలుగుచుండగా, అస్య=వీనియొక్క, సర్వదుఃఖానాం=సమస్తదుఃఖములకు, హానిః=నాశము, ఉపజాయతే=కలుగుచున్నది.

తా. అట్టి యీపురుషునియొక్క, మనస్సు ఆత్మదర్శనమునకు ప్రతిబంధకములైన దోషములన్నియుఁ దొలగి, ప్రసన్నము కాఁగా, అప్పుడే శుద్ధాత్మవిషయమగుబుద్ధిశీఘ్రముగా స్థిరపడుచున్నది. ఇట్లుమనఃప్రసాదముఆత్మదర్శనమునకు హేతువగుటంబట్టి దానిచే ప్రకృతిసంసర్గమువలన జనించిన సమస్తదుఃఖములకును నాశము కలుగును.

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయతశ్శాన్తిరశాన్తస్య కుతస్సుఖమ్॥ 66

టీ. అయుక్తస్య=యోగము(అనగా భగవంతునియందు మనస్సునుసన్న్యసించుట) లేనివానికి, బుద్ధిః=శుద్ధాత్మవిషయమగుబుద్ధి నాస్తి=లేదు- సిద్ధింపదు. అయుక్తస్య=అట్టివానికి, భావనాచ=ఆత్మస్వరూపమనుమననముచేయుటయు, నాస్తి=లేదు. అభావయతః=ఆత్మధ్యానములేనివానికి, శాన్తిః=విషయస్పృహానివృత్తి, నాస్తి=లేదు. అశాన్తస్య=విషయములయందాశనివర్తింపనివానికి సుఖః=సుఖము - నిత్యనిరతిశయ సుఖప్రాప్తి, కుతః=ఎక్కడిది.

తా. నాయందు మనస్సును సన్న్యసింపక స్వప్రయత్నవ

ంనే ఇంద్రియనిగ్రహము చేయఁబూనినవానికి ఒకప్పుడును శు
ద్ధవిషయ మగుబుద్ధి సిద్ధింపదు. కావుననే వానికి ఆత్మమననముం
డదు. శుద్ధాత్మస్వరూపమును మననము చేయనివానికి విష
యములయందలి స్పృహ నివర్తింపదు. విషయాభిలాష వదలని
వానికి*నిత్య నిరతిశయసుఖప్రాప్తి యెక్కడిది?

అవ. చెప్పఁబడినప్రకారమున ఇంద్రియజయము గావింపని
వానికి కలుగునట్టియనర్థమును మరలఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి ॥ 67

టీ. చరతాం=(విషయములయందు) ప్రవర్తించుచున్న, ఇ
న్ద్రియాణాం=ఇంద్రియములయొక్క, (వర్తనం=వృత్తిని), అను=అ
నుసరించి, యత్ =ఏ, మనః=మనస్సు, విధీయతే=వర్తిల్లఁజేయఁబడు
చున్నదో, తత్ =ఆమనస్సు, అస్య=వీనియొక్క, ప్రజ్ఞాం=ఆత్మ
స్వరూపవిషయమగుబుద్ధిని, అమ్భసి=నీటియందు, నావం=ఓడను,
వాయురివ=వాయువువలె, హరతిహి=ఆకర్షించుచున్నదిగదా.

తా. పురుషుఁడు తన మనస్సును, విషయములందు వర్తించు
చున్నయింద్రియముల పోకడల నెంబడిఁ బోవనిచ్చెనేని, అట్టిమన
స్సు, నీటియందు నడపఁబడుచున్నయోడను ప్రతికూలమగువాయు
వు బలాత్కారమున వేఱుదెసకుఁ గొనిపోవునట్లు, శుద్ధాత్మస్వరూ
పమునందాసక్తమగువానిబుద్ధిని వేఱుచోటికిఁ గొనిపోవుచున్న
ది. (అనఁగా విషయాసక్తముగఁ జేయుచున్నది అనియర్థము).

---

*అశాంతులకే స్వర్గాదిసుఖములు లభించును. శాంతులు అట్టిసుఖములనుగోరు
టలేదు. కాన యిట శాంతివలనఁ గలుగుసుఖము స్వర్గాదిసుఖముగాక నిత్యనిరతి
శయమైన మోక్షసుఖమే యగునని తెలియునది.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 68

టీ. హేమహాబాహో=భుజబలముగల అర్జునా, తస్మాత్=ఆ హేతువువలన, యస్య=ఎవ్వనియొక్క, ఇన్ద్రియాణి=ఇంద్రియము లు, ఇన్ద్రియార్థేభ్యః=విషయములనుండి, సర్వశః=అన్నివిధము లచేత, నిగృహీతాని=నిగ్రహింపఁబడినవో, తస్య=వానియొక్క ప్రజ్ఞా=జ్ఞానము, ప్రతిష్ఠితా=మిక్కిలి స్థిరమయినది.

తా. (ముందుచెప్పఁబడినప్రకారమున మనస్సునకు శుభాశ్ర యుఁడగు నాయందు నుంపఁబడినమనస్సుగలవాఁడగుటచే) ఎవ్వఁ డు తనయింద్రియములను విషయములనుండి సమస్తవిధముల నిగ్ర హింపఁజేయునో వాఁడే స్థితప్రజ్ఞుఁడు.

అవ. ఇట్లు ఇంద్రియముల నడంచి ప్రసన్నమగుమనస్సునొం దినవాని కగుసిద్ధిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥ 69

టీ. సర్వభూతానాం = సమస్తప్రాణులకు, యా = ఆత్మవిష యమైన ఏబుద్ధి, నిశా = రాత్రివలె అప్రకాశమైనదో, తస్యాం ఆత్మవిషయమయిన ఆబుద్ధియందు, సంయమీ=ఇంద్రియముల నడంచినవాఁడు - ప్రసన్నమనస్కుఁడగుయోగి, జాగర్తి = జాగ రూకుఁడుగా నుండును - అనఁగా ఆత్మావలోకనముచేయుచుం డును, యస్యాం = శబ్దాదివిషయమైన ఏబుద్ధియందు, భూతా ని = ప్రాణులు, జాగ్రతి = జాగరూకులై యుండునో, సా = శ బ్దాదివిషయమగు నాబుద్ధి, పశ్యతః=ఆత్మావలోకనము చేయ

మన్న, మునేః=మననశీలునికి, నిశా=రాత్రి-రాత్రివలె అప్రకాశ
మయియుండును.

తా. (ఆత్మవిషయమగుబుద్ధియే ఆత్మను కనుఁగొనుటకు సాధ
నము.) సర్వప్రాణులకు ఆబుద్ధి రాత్రివలెఁ బ్రకాశింపకుం
డను కాఁబట్టి వా రాత్మను కనుఁగొనఁజాలరు. అయినను
ఆబుద్ధి ప్రసన్నమనస్కుఁ డగువానికి పగటివలె ప్రకాశించుచుం
డుటచే వాఁడు మేలుకొని దానిమూలమున ఆత్మను కనుఁగొను
చుండును. ప్రాణులు శబ్దాదివిషయమనగుబుద్ధియందు మెలఁకువగలి
గియుందురు-అనఁగా వారి కదియే ప్రకాశించుచుండును. అది
ఆత్మదర్శనము సేయుచుండుమునికి రాత్రివలె అప్రకాశమై యుం
డును. (సర్వప్రాణులకు బుద్ధి ఆత్మవిషయమై యుండనేరక శబ్దాది
విషయమైయుండుననియు. మునికి బుద్ధి శబ్దాదవిషయమై యుం
డనేరక ఆత్మవిషయమై యుండుననియును భావము.)

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్।
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ॥ 70

టీ. ఆపూర్యమాణం=అంతట తనంతనె నిండింపఁబడుచున్నది
యు, అచలప్రతిష్ఠం=చలింపనిస్థితిగలదియు-అనఁగా ఏకరూపమై
నదియునగు, సముద్రం=సముద్రమును, ఆపః=నదీజలములు, య
ద్వత్=ఎట్లు, ప్రవిశన్తి=చొచ్చుచున్నవో, తద్వత్=అట్లు, సర్వే=
సమస్తములయిన, కామాః = కోరికలు-శబ్దాదివిషయములు,
యం=ఎవనిని, ప్రవిశన్తి=చొచ్చుచున్నవో-ఏజితేంద్రియునియిం
ద్రియములకుగోచరించుచున్నవో, సః=వాఁడు, శాన్తిం=శాంతిని,

ఆప్నోతి= పొందుచున్నాఁడు, కామకామీ= విషయాసక్తుఁడగు వాఁడు, న (ఆప్నోతి)= శాంతిని పొందఁడు.

తా. తనంతటనె పూర్ణమైయుండు సముద్రము, నదీజలములు ప్రవేశించినను ప్రవేశింపకపోయినను, ఎట్లు కలంపఁబడక, యే విశేషమునుగాని పొందక, యేకరూపమునుగా నుండునో, ఆతెఱఁగుననే యెవఁడు తనయింద్రియములకు శబ్దాదివిషయములు గోచరములైనను కాకున్నను, ఆత్మావలోకనతృప్తుఁ డగుటచేత తాను ఏవికారమును బొందక యుండునో, వాఁడే శాంతినిబొందును. శబ్దాదులచే వికారమునొందువాఁడు ఒకప్పుడుగాని యాశాంతిని బొందఁడు.

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః।
నిర్మమో నిరహఙ్కారస్స శాన్తి మధిగచ్ఛతి॥ 71

టీ. యః=ఏ, పుమాన్=పురుషుఁడు, సర్వాన్=సమస్తములగు, కామాన్=కోరికలను (శబ్దాదివిషయములను), విహాయ= విడిచి, నిస్స్పృహః=ఆశ లేనివాఁడును, నిర్మమః=మమత లేనివాఁడును, నిరహఙ్కారః= దేహమునం దాత్మాభిమానము లేనివాఁడునునై, చరతి=వర్తించుచున్నాఁడో, సః=వాఁడు, శాన్తిం=శాంతిని, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. ఏపురుషుఁడు శబ్దాదిసమస్తవిషయములను పరిత్యజించి వానియందు అభిలాష లేనివాఁడును మమత లేనివాఁడునునై ఆత్మకానట్టి దేహమునం దాత్మాభిమానము లేకయు వర్తించునో, వాఁడు ఆత్మదర్శనముచేత శాంతిని బొందును.

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ 7

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాఙ్ఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః.

శ్రీకృష్ణాయపరబ్రహ్మణేనమః.

---

టీ. హే పార్థ=అర్జునా, ఏషాస్థితిః=కర్మానుష్ఠానమందలి యీ స్థితి, బ్రాహ్మీ=బ్రహ్మప్రాప్తికి హేతువైనది, ఏనాం=దీనిని, ప్రాప్య=పొంది, న విముహ్యతి=మోహమునొందఁడు-మరలసంసారమును బొందఁడనుట, అన్తకాలే అపి=చరమవయసునందయినను, అస్యాం=ఈ స్థితియందు, స్థిత్వా=ఉండి, బ్రహ్మనిర్వాణం=బ్రహ్మానందమును, ఋచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా. ఈస్థితి (అనఁగా ఆత్మనిత్యత్వజ్ఞానపూర్వకమై స్థితప్రజ్ఞత నుద్దేశ్యముగాఁ గలదై యొప్పు ఫలసంగరహితకర్మానుష్ఠానము) బ్రహ్మప్రాప్తికి హేతువు. ఇట్టి కర్మస్థితిని బొందిన మనుజుఁడు మరల సంసారమును బొందఁడు. అంత్యమవయసునందేనియు నిట్టిజ్ఞానము గలిగెనేని నిర్వాణసుఖమగు బ్రహ్మమును(అనఁగా సుఖైకస్వరూపమగు నాత్మను) బొందుచున్నాఁడు.

ఇట్లు ఆత్మయాథాత్మ్యమును, యుద్ధమనెడుకర్మము ఆ యాథాత్మ్యమును బొందుటకు సాధనమగుటయును ఎఱుఁగక, శరీరమేయాత్మయనుభ్రమముచే మోహితుఁడై, యా మోహముచే యుద్ధమునుండిమరలినట్టివానికిమోహముశమించుకొఱకునిత్యమైనయాత్మనుగూర్చినసాంఖ్యబుద్ధియు; ఆబుద్ధిని మున్నిడుకొన్నదియు, అసంగకర్మానుష్ఠానరూపమగుకర్మయోగమును గూర్చినదియు, స్థితప్రజ్ఞతకును (అనఁగాజ్ఞానయోగమునకును) యో

గమునకును (అనఁగా ఆత్మదర్శనమునకును) సాధనమైనదియు నగు యోగబుద్ధియును; ద్వితీయోఽధ్యాయమందు చెప్పఁబడినవి. ఆ విషయమే 'సత్యాత్మాఽసఙ్గకర్మేహే గోచరా సాంఖ్యయోగధీః। ద్వితీయే స్థితధీలక్షా ప్రోక్తా తన్మోహశాన్తయే' అని గీతార్థసంగ్రహమున చెప్పఁబడినది.

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగ
శాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును నగు
శ్రీభగవద్గీతలందు సాంఖ్యయోగం బన్నది
ద్వితీయాధ్యాయము.

---

# శ్రీభగవద్గీతా-తృతీయోఽధ్యాయః.

## కర్మయోగః.

---

### అవతారిక.

* వేదాంతములం బ్రతిపాదింపఁబడి, సమస్తములైన యవిద్యాది దోషములను లేశముగూడ లేనట్లు నిరసించి, అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణుఁడును పరబ్రహ్మమునైనయొప్పు పురుషోత్తముని బ్రాపించుటకు †ఏకాంతికాత్యంతికభక్తి ఉపాయమగును. అది వేదనము ఉపాసనము ధ్యానము మొదలైన శబ్దములచేఁ జెప్పఁదగియున్నది; మఱి ముముక్షువునకు ప్రాప్యమైనది. దానికి అంగము ఆత్మయాథాత్మ్యదర్శనము. కావున నిట్లు

---

* 'ఈశాస్త్రము మోక్షప్రధానమైనది. ద్వితీయాధ్యాయమందుఁ జెప్పఁబడినయర్థము సాక్షాత్తుగా మోక్షోపాయముగాదు. కాఁ యట్టియర్థమును ఇట్టి శాస్త్రమునఁ జెప్పుట యసంగతము, అని శంక రాఁగా, నిందు సంగతి మేమని నిరూపించుచున్నారు. ఎట్లన, పరమపురుషప్రాప్తి యనెడు మోక్షమునకు ఉపాయము భక్తి. భక్తికి అంగము ప్రత్యగాత్మదర్శనము. దీనికి సాధనములైన కర్మయోగాదుల స్వరూపములే రెండవ యధ్యాయమునఁ జెప్పఁబడినవి గాన అసంగతి లేదని భావము.

† ఏకాంతమనఁగా (ఏకత్ర అంతః) ఒక్క దానియందే నిశ్చయము. అట్టిది ఐకాంతికము. అనఁగా దేవతాంతరఫలాంతరములను పరిత్యజించి ఈశ్వరుని ప్రాప్యముగాను ప్రాపకముగాను దలఁచి వానియందే నెలకొనియుండునట్టిది. ఆత్యంతికమనఁగా అత్యంతమైనది-అంతములేనిదనుట. ఫలదశయందును నివర్తింపకుండునదని భావము. ఉపాయదశ మొదలుకొని ఫలదశవఱకును నశింపక పెపె నిరతిశయముగా పెరుఁగుచుండునదనుట.

ముముక్షువునకుఁ బ్రాప్యమైనభక్తిని జెప్పుటకుఁగాను ముందు దానియంగము 'య ఆత్మా ఽపహతపాప్మా' ఇత్యాదిప్రజాపతి వాక్యములచే ప్రతిపాదితమైనప్రాప్తయగు(భగవత్ప్రాప్తిని గోరు) ఆత్మయొక్క యాథాత్మ్య దర్శనమనియు, అది జ్ఞానయోగముచే సిద్ధించునదనియు,జ్ఞానయోగము ఆత్మనిత్యత్వజ్ఞానపూర్వకమైన అసంగకర్మానుష్ఠానమువలన (కర్మయోగమువలన) నిష్పన్నమగుననియుజెప్పఁబడినది. *ఆత్మదర్శనముపరవిద్యకు(అనఁగా

---

*ఇది మొదలుగా భక్తికి ఆత్మదర్శనము అంగమనుటకుఁ బ్రమాణములను దాహరించుచున్నారు. 'య ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘిత్సో ఽపిపాస స్సత్యకామ స్సత్యసఙ్కల్పః సోఽన్వేష్టవ్య స్సవిజిజ్ఞాసితవ్యః స సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ కామాన్ య స్తమాత్మాన మనువిద్య విజానాతి ఇతిహ ప్రజాపతిరువాచ'(ఛాందోగ్య.౮-౭-౧)ఏ జీవాత్మ పాపరహితుఁడును, ముసలితనము లేనివాఁడును, మృత్యువులేనివాఁడును, శోకరహితుఁడును, ఆఁకలిలేనివాఁడును దప్పిలేనివాఁడును, సత్యకాముఁడును,సత్యసంకల్పుఁడును, నగునో వానిని వెదకవలయును; వానిని దెలిసికొనవలయును. ఎవ్వఁడాయాత్మను ఎఱింగి ధ్యానముసేయునో వాఁడు సర్వలోకములను సర్వకామములను బొందును' అని యర్థము. ఇది దహరవిద్యాప్రకరణము. దహరవిద్యయనఁగా హృదయమున దహరాకాశమందున్న పరమాత్మను బొందువిద్య. ఇట ప్రజాపతికిని ఇంద్రునకును సంవాదమున్నది. ఈసంవాదమున ప్రజాపతి వరుసగా జాగ్రత్తు స్వప్నము సుషుప్తి యనెడియవస్థలతోఁ గూడినప్రత్యగాత్మను ఇంద్రుని కుపదేశింపఁగా నతఁడు 'నాహమత్ర భోగ్యం పశ్యామి' 'ఈ ప్రతిబింబాత్మయందు అమృతత్వాభయత్వాదికమైన భోగ్యము నాకుఁ గనుపట్టలేదు' అని యందందు విముఖుఁడై మరలమరల నడిగెను. పిదప నతనియోగ్యతను గనుఁగొని ప్రజాపతి 'అశరీరం వావ సన్తమ్ న ప్రియాప్రియే స్పృశతః' ఛాం.౮-౧౨-౧ 'కర్మారబ్ధమైన దేహమును వీడియున్న యాత్మను

